# మిసిమి

"All that we are is the product of what we have tho
is "We are what we think." — Dammapada.

సంపుటి 8 జూన్ 1996 సంచిక 5

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



ముఖచిత్రం : ఫ్రాంక్ ఫ్రాజెట్టా గోల్డెన్ గరల్

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి.

# DOUBLE STANDARD

*- BY CHARLES NEWTON*

People in the Indian film industry often accuse the central Board of Film certification of adopting "double standards" in censoring films - one of those made in this country and another for films from foreign countries. Commonly, the expression "double standards" is used not only here, but in other countries as well, in the belief that since "double" means "two", "standards" is the appropriate word. But according to the latest edition of The COD, the correct expression is "double standard", which means "A rule or principle applied more strictly to some people than to others (or to oneself)". Just as many people have difficulty in dieciding when to use "who" and when, "whom", "that" and "which" provide almost equal complexities. However, merely to simplify the problem - to some extent, at least - specially for those in a hurry and unable to unravel the skein of rules that govern the two words - "that" describes ("This is the house that Jack built") and "which" qualifies: "I always buy his books, which have influenced me greatly". But those interested in a study of the difference between the two words should see Fowler's Dictionary of Modern English Usage.

It is common to see the expression, "with effect from..." - "postal rates will be increased with effect from..." - but if they were omitted, the relevant sentence would not change in meaning in any way. Certain words are in use in India alone. For instance, in press reports, we often see sentences like "Ram Singh, the notorious don in the coal belt, has been arrested". We understand what "don" means because of the context. But what is the origin of "don"? It is not included in any dictionary in the sense in which it is generally used in the Indian Press. Similarly, "rake" as a synonym of "train" is peculiar to the railway community in this country alone. Recently, a newspaper had the words, "Four coaches of the rake were burnt..." Sentence in a newspaper: "The Queen has asked Prince Charles and Lady Diana to press ahead with divorce, calling permanent time out for the most fascinating soap opera to run in Britain in recent times". However, "permanent time out" is a contradiction in terms, because "time out" means "A brief intermission in a game etc."

Sentence in The Times, London: "The imprisonment of political dissidents, some of whom are now significant political figures, was a hallmark of Korean life in the 1970s and early 1980s as were spectacular corruption and the killing of protesters". To imprison political dissidents is by no means a praiseworthy action in any country. Therefore, for the writer of the sentence quoted to say that it "was the hallmark of Korean life..." is absurd. According to the latest edition (the ninth) of The COD. "Hallmark" is defined thus: "A mark used by the British assay offices indicating the standard of gold, silver and platinum. Any distinctive feature especially of excellence. Designate as excellent". Hallmark is derived from Goldsmiths Hall in London, "where articles are tested and stamped". William Rees-Mogg, now Lord Rees-Mogg, former Editor of The Times, London, says in a recent article in that paper that language is a richer repository of wealth than a story of jewels. He ends his article with a rich encomium for words. "Compared with words, diamonds are but blunt instruments, but human beings find in them the same qualities of symbolism and concentration the same sharpness with which to cut. The Begum Blue itself symblizes a certain idea of beauty, but also the idea of wealth and power. Yet it is a prime symbol for the innate folly of human nature: what sane person would rather have a bright blue pebble than a sum of money which would guarantee the wealth of a family for several lifetimes? Words of course are far more powerful: they reach into the innermost caves of the human mind. The love of diamonds we share with birds: the love of words we share with angels. Though Samuel Johnson thought the opposite, things are the sons of earth and words are daughters of heaven".

# ఇరవయ్యో శతాబ్ది నీలి నీడలు

## అపశ్రుతి సిద్ధాంతం

- అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

ఆధునిక సమాజం నిస్పృహ, నిరాశ, అవసాదం (depression), ఒత్తిడి (stress) వ్యాకులత (anxiety) లాంటి మానసిక వైకల్యాలతో బాధితమవుతోంది. ఆదిమ సమాజాలలో మానవుడు ఇలాంటి బాధలకు గురైనట్లు మనకు దాఖలాలు లేవు. మరి ఈ సమస్యలు మన ఆధునిక సమాజానికే ఎందుకని ప్రత్యేకం. ''మానవ జాతి అవతరించి పరిణమించిన నాటి పరిస్థితులలో కంటె భిన్న పరిస్థితులలో జీవించగల మనుషులు నేటి సమాజానికి అవసరం - అనే వాస్తవాన్ని గుర్తించాలి. ఈ వాస్తవమే నేటి సామాజిక, మానసిక సమస్యలకు మూల కారణం అని నేనంటాను'', అన్నాడు 'అనబాంబర్' తన విధాన ప్రకటనలో. అనబాంబర్ అనేది మారుపేరు. 3500 ల పదాలున్న తన విధాన వ్యాసాన్ని వాషింగ్టన్ పోస్ట్‌గాని, న్యూయార్క్ టైమ్స్‌గాని ప్రచురించాలి అలా ప్రచురించని పక్షంలో అజ్ఞాత లక్ష్యాల మీద బాంబులు వేసి జననష్టాన్ని కలిగిస్తానని బెదిరించాడు. జన నష్టానికి అంగీకరించలేని ఆ పత్రికలు గూఢచారి శాఖకు విషయాన్ని తెలియజేసి, ప్రచురించడానికి ఒప్పుకొన్నాయి. ఖర్చులు చెరిసగం భరించి, సెప్టెంబరు 19, 1995 నాటి వాషింగ్టన్ పోస్టు ఆ వ్యాసాన్ని అంటే ఆయన విధాన ప్రకటనను ప్రచురించింది అతడికోసం 17 సంవత్సరాల నుంచి యఫ్ బి ఐ అన్వేషిస్తూనే ఉంది. అతడు తన ఆలోచనలను సిద్ధాంతాలను, విధానాలను బయట పెట్టే పద్ధతులకు అంగీకరించక పోయినా అతడి శాస్త్రీయ సిద్ధాంతాలను అనేక సందర్భాలలో అంగీకరించ వలసే ఉంటుంది.

ఈ ఆధునాతన నాగరక ప్రపంచంలో ఏదో పోగొట్టుకొన్నట్లు ఈ సురోవంటూ, అసంతృప్తంగా, నిరాసక్తంగా తిరుగాడే జనం నానాటికి ఎక్కువ అవుతున్నారు. సాంకేతిక విజ్ఞాన శాస్త్రం అనేక అద్భుతాలను సృష్టించింది. అవన్నీ మానవ జీవితాన్ని సుకరం చేయడానికే వచ్చాయి. అయినా మనిషికి ఊరట చేకూరడం లేదు. అతని అంతరాళాల్లో ఏదో గాడి తప్పి, అపశృతి వినిపిస్తోంది. జీవితం నిరర్థకం అనే భావన ముప్పిరిగొంటోంది. ఎడతెరిపి లేని దైనందిన కార్యక్రమాల్లో కూరుకు పోవడంతో పరిమాణ కాలం (quantity time) ఖర్చు అయిపోయిందని ఒత్తిడికి గురవుతున్నాడు. అర్థవంతంగా గడపలేని గుణకాలం (quality time)చే జారి పోయిందని వ్యాకుల తకు లోనవుతున్నాడు. ఏమైతేనేం, ఆధునిక మానవుడు ''తాను'' ఈ ఆధునిక జీవితానికి సరిపడేట్టు తయారించ బడలేదు, అనే భావనతో అతాకుతలం అవుతున్నాడు. ''సహజ ప్రవర్తనా పద్ధతుల కంటె భిన్నంగా, దూరంగా ప్రవర్తించేట్లు ఈ ప్రపంచం మనపై ఒత్తిడితెస్తోంది. మనం దానితో ఇమడలేము,'' అనుకొంటున్నాడు.

ముఖ్యంగా ఈ భావన అమెరికా లాంటి అభివృద్ధి చెందిన దేశాలలో ఎక్కువగా ఉంది. పాశ్చాత్య నాగరకత దాడి చేస్తున్న మన దేశంలాంటి దేశాలలోగూడా అనతి కాలంలో ఈ ప్రభావం, ఈ రుగ్మతలు అధికమయ్యే అవకాశం ఉంది.

అంతేకాదు ఒకప్పుడు సెల్యులర్ ఫోన్‌లు, పేజర్లు, ఇంటర్నెట్‌లు, టి.వి. లు రథాలు, కార్లు, విమానాలు, రెళ్ళు లేవు. అటువంటి కాలానికి సరిపడేట్టుగా మానవ మనస్సు - ఉద్వేగాలు,

వాంఛలు, అవసరాలు - పరిణామం చెందింది. ఈ విషయాన్నే ఫ్రాయిడ్ తన Civilization and its discontents అనే గ్రంథంలో చర్చించాడు మన పూర్వీకులు నిరంకుశుడైన పురుషుని పాలన క్రింద ఉండే ప్రాక్తన సమూహం (preimal horde) లో జీవించారని, కొన్నాళ్ళకు అతని కొడుకులు ఎదురు తిరిగి అతనిని చంపి, అతడి మాంసం తిన్నారని, ఆ విప్లవంతో మతా విర్భావం జరిగి, ఎలాగో ఆ పరాధభావన తరువాతి తరాలకు - మనతో సహా - దిగుమతి అయిందని ఆయన ప్రతిపాదించాడు ఏది ఏమైనా ఫ్రాయిడ్ ప్రకల్పన, విశ్లేషణ కాలికం.

ఆధునికి పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు ఫ్రాయిడ్ ప్రకల్పనను త్రోసిరాజని, కొంత వరకు వస్తుగత దృష్టితో మానవ మనస్సు పరిణామాన్ని వివరించ పూనుకొంటున్నారు ''మానవ మనస్సు పరిణామం సహజ వరణం (Natural Selection) నిర్దేశితం'' అంటున్నారు. అంతేకాదు, ''అపశృతి సిద్ధాంతం'' (Mismatch theory) ఒకటి కొద్ది కాలంలో ఆవిర్భవించ బోతోంది, దానితో ప్రాక్తన, ఆధునిక పరిసరాలు జతకలవని కారణంగా ఉత్పన్నమయ్యే రుగ్మతలను వివరించవచ్చని వీరిలో కొంత మంది అంటున్నారు. మనం సృజించబడింది ఆదిమ సమాజంలో నివసించడానికి, కాని మనం ఉంటున్నది ఆధునిక ప్రపంచంలో అంటే చదరపు రంధ్రంలో గుండ్రని మేకులం. పొత్తుకుదరని ఈ కలయిక వల్ల అవసాదం depression లాంటి మానసిక వ్యాధులు వచ్చేవారి సంఖ్య ప్రతి పది సంవత్సరాలకు రెట్టింపు అవుతోంది. పారిశ్రామిక సమాజాల్లో ఇది మరీను. హత్యలు ఆత్మహత్యలు, మరణ సదృశ్యమైన బాహిరత (పరాయితకం alienation) ఈ యుగ లక్షణాలయ్యాయి. అనబాంబర్ తన విధాన ప్రకటలో పేర్కొనేది ఈ బాహిరతను గురించే.

సామాజిక సంస్పర్శ (Social Contact)లో'' సామాజికత'' లేదు పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రం (evolutionary psychology) ఈ ఇరవయ్యో శతాబ్దం నీలినీడలన్నింటిని నిక్కచ్చిగా, స్పష్టంగా వివరించ గలుగుతుందని మనం చెప్పడం లేదు మనం సహజమని భావించిన అనేక అంశాల మీద అది కొత్త వెలుగును ప్రసరిస్తోంది. అది చెప్పిన విషయాలన్నింటిలోకి ఆశ్చర్యం గొలిపేది ఆది ''మనిషిలోని జంతువు''ను వర్ణించిన తీరు. మనలోని లాలస (lust) దౌర్జన్యం (aggression) లాంటి పాశవిక ప్రవృత్తులను, అణచివేసే దాంతశక్తిగా నాగరకతను ఫ్రాయిడ్ అభివర్ణించాడు. ఆ కారణంగానే మానసిక రుగ్మతలు వస్తున్నాయన్నాడు ఫ్రాయిడ్. కాని పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రం, ఫ్రాయిడ్‌ని కాదని, '' ఈరుగ్మతలకు కారణం నాగరకత నాగరకతా తనా (Civility స్నిగ్ధ సంస్కారం) నికి అడ్డు పడడంలో ఉంది'', అంటున్నది. నాగరకత ఇలా అడ్డుకోవడం కారణంగా మానవ స్వభావంలో ఉన్న నెమ్మది తనం, స్నిగ్ధత, స్నేహ పిచ్చులత, కారుణ్యం మొదలైన మృదు ప్రవృత్తులు బలి అవుతున్నాయి. ఈ 20 లక్షల సంవత్సరాలలో మానవ మనస్సును మలచిన సామాజిక పరిసరాలు కాలగర్భంలో కలిసి పోయాయి. వాటిని పరిశీలించాలంటే ఒకటే మార్గం ఉంది. ఆధునిక నాగరకతతో కలుషితంగాని ఆధునిక ఆదిమ జాతులను - నేటి కొండజాతులను, తెగలను, ఆటవికులను - పరిశీలించడం అది. మానవశాస్త్రజ్ఞులు అదే పని చేశారు. అయితే ఆ సమాజాలేవీ అంత ఆదర్శవంతాలూ కావు, స్వర్గతుల్యాలూ కాదు. రూసో వర్ణించిన '' ఉదాత్త బర్బరు'' (Noble savage) ని కంటె హాబ్స్

వర్ణించిన ''మూర్ఖ అసంస్కృత'' మానవునికి దగ్గరగా ఉన్నాయి ఆ సమాజాలు. వాటిలో కరువు కాటకాలు, క్రూరజంతువుల వలన బాధలు, నయంకాని రోగాలు ఉన్నాయి. అనబాంబరు చెప్పినట్లు సాంకేతిక విజ్ఞాన చక్రాన్ని వెనక్కి తిప్పి గతంలోకి పోయి ఆ సమాజాలలో ఉండాలంటే మన మెవరం అంగీకరించం. అంత మాత్రాన మనం ఆ సమాజాల నుంచి తెలుసుకోవలసింది ఏమీ లేదనుకోవడం పొరపాటు అసలు వాస్తవం ఏమిటంటే, ఇప్పటి ప్రపంచంలో గరగరలతో మెరమెరలతో పని చేసే మన మనస్సులు సమర్థవంతంగా మృదువుగా పని చేయడానికి వీలైన ప్రపంచం అది. కార్లు, ఆల్కహాలు, విద్యుత్తు లేని వారి ప్రపంచాన్ని మనం గుడ్డిగా అనుకరించ నక్కర లేదు. అయితే ఇక్కడ మనం ఒక ప్రశ్న వేసుకోవాలి. మన ఈ ప్రపంచంలో కంటె ఆ ప్రపంచంలో తక్కువ మంది డిప్రెషన్‌తో బాధ పడుతున్నారు - ఎందుకు?

నాటి సమాజాల్లో దౌర్జన్యం, హింసలు ఉన్నప్పటికి పోటీ (Competition) ప్రక్రియ సున్నిత రూపాలను ధరించింది జీవిత భాగస్వాముల కోసం కష్టించి నైపుణ్యంతో పని చేశారు. ఈ పోటీ కారణంగా డార్విన్ చెప్పిన పర్యవసానాలు అని వార్యాలు కదా. పోటీలో గెలిచినిలిచిన వానికి అంతస్తు పెరుగుతుంది. స్త్రీలు అతనినే కోరుతారు. ఆ విధంగా వారి జన్యులు తరువాతి తరాలకు సంక్రమించే అవకాశాలు మెరుగవుతాయి. జన్యు సంక్రమణం అనే ప్రమాణం మీద ఆధారపడి మానవ మనస్సు తయారైంది. జన్యు సత్వర ఉత్పాదనకు, విస్తరణకు దోహదం చేసే ''మానస లక్షణాలు'' అతి జీవించాయి (survived). అవే ఈ నాటి మన మనస్సుల మూలకాలు. అవే మనం. అంటే మన మనస్సులు ఆ నాటివి, శరీరాలు ప్రపంచం ఈనాటివి ''సాంకేతిక పరిజ్ఞానం లేని సామాజిక నిర్మితి ''ద్వారా జన్యువులను సంక్రమింప జేయడానికి మనం తయారు చేయబడ్డాం. దీనిలో ఒక సుగుణం ఉంది. సామాజిక సహకారం (Social Cooperation) అతి జీవనావకాశాలు (Chances for survival) పెంచుతుంది. స్నేహం, వాత్సల్యం కృతజ్ఞత విశ్వాసాలకు సంబంధించిన ప్రాథమిక నిర్మితిని (infrastructure) సహజ వరణం (Natural Selection) మన మనస్సులలోకి చొప్పించింది.

అయితే దీనికి రెండో ప్రక్క గూడా ఉంది. మనకు మిత్రులతో పాటు శత్రువులూ ఉన్నారు. రాగ ద్వేషాలున్నాయి. కోపం కరుణలున్నాయి. విశ్వాసావిశ్వాసాలు ఉన్నాయి జయాపజయాలు సుఖదుఃఖాలను కలిగిస్తాయి. మరి ఈ అసంతోషకర అనుభూతులు ఎందుకున్నట్లు? పిల్లలకు ఎప్పుడు ఏ అపాయం జరుగుతుందోనని పెద్దలు వ్యాకులతతో వారిని కాపాడ ప్రయత్నించారు. అపాయ కర సన్నివేశాలకు దూరంగా ఉంచారు. ఓటమి వలన కలిగిన దుఃఖం, అసంతోషం ఆత్మ విమర్శకు దారితీసి, మళ్ళీ ఓటమి కలిగించే ప్రవర్తనను పునశ్చరించరాదనే నిర్ణయానికి దారి తీసింది. ''అసంతోషకర అనుభూతులు కారణంగా మన పూర్వికులు తరువాతి తరానికి జన్యు సంక్రమణాన్ని విజయవంతంగా జరిపారు'' అంటుంది పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రం. అందుకే, అసంతోషకర అనుభూతుల వలన గతంలో కలిగిన ఉపయోగం కారణంగానే ప్రతి సంస్కృతిలోను, నియత కాలాల్లో దుఃఖం అని వార్యంగా సహజమైంది.

మరి అసహజమైంది ఏమిటి? దుఃఖం దుఃఖంగానే ఉంటే బాధ లేదు. అది సహజమే. దుఃఖం కాకుండా పోతే అది అసహజమవుతుంది. దుఃఖం దుఃఖం కాకుండా ఎప్పుడు పోతుంది? దుఃఖం

కొనసాగి, కొనసాగి మనిషిని నిర్వీర్యం చేసి అవసాదానికి (depression) దారి తీసినప్పుడు. దుఃఖం రోగం కాదు, మరి అవసాదమో? అది రోగం. ఇదీ అసహజం. ఈ అసహజ రోగాలు ఆధునిక జీవన ఫలితాలు. పరిశోధకులు ''సోమా ఒ'' తెగలను పరిశీలించారు. వ్యాకులత ఎక్కువైనందు వల్ల జనించే కార్టిసోల్(cartisol) వారిలో చాల తక్కువ మోతాదులలో కనిపించింది. ఇదే పాశ్చాత్య నాగరక సమాజాలలో అయితే చాల ఎక్కువ మోతాదులలో ఉంది. 'అవసాదం' అనేది వారిలో మచ్చుకైనా కానరాలేదు. దీనిని బట్టి 'అవసాదం' ఆధునిక నాగరకతా ఫలమని వేరే చెప్ప పనిలేదు.

దుఃఖం అత్యంత సహజమైంది. మరి సహజమైన ఈ దుఃఖాన్ని అసహజమైన రోగంగా - అవసాదంగా - మార్చేది ఏమిటి? సామాజిక ఏకాంతత (Social isolation). ఆదిమ సమాజాలలో మనిషి ఒంటరిగాడు కాదు. కలిసే తినేవారు. కలిసే పండేవారు. అయితే వారిలో తగవులు లేవని కాదు. ఉన్నా వాటిని పెద్దలు చిటికెలో తీర్చివేసేవారు. అదే అమెరికాను తీసుకొంటే ప్రతి నాలుగిళ్ళకు ఒక ఇంటిలో ఒంటరి వాడుంటున్నాడు. అతడు ఏకాకి తనాన్ని అనుభవిస్తున్నాడు. 'నా' అనే వారు ఎవరూ లేక దిగాలు పడిపోతున్నాడు. ఇతరులకు దూరమవ్వడమే కాదు, తనకు తానే దూరుడవుతున్నాడు. ఏకాంత వాసం ఎంత దుర్భరమో అనుభవించే వాళ్ళకే తెలుస్తుంది. ఏకాంత కారాగార వాస శిక్షలో రహస్య మేమిటో మనం ఇప్పుడు అర్థం చేసుకోవచ్చు. ఎవరినైన కలవాలంటే ముందుగా అపాయింట్‌మెంట్ ఉండాలి. అదే ఆదిమ సమాజాలలో ఎప్పుడు పడితే అప్పుడు కలవవచ్చు. ఈ నాటికీ మన పల్లెల్లో అది సంభవం అవుతోంది. 1980ల్లో చీర్స్ (Cheers) అనే ఒక టి.వి. షో ప్రదర్శన ప్రదర్శితమైంది. అది విపరీతంగా అమెరికన్లను ఆకట్టుకొంది. ఈ ఆకట్టు కోవడంలో అమెరికన్లు ''ప్రాచీన జీవితం'' (షోలో ప్రదర్శించింది ప్రాచీన జీవితమే) కోసం ఎంతగా అర్రులు సాచిందీ పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులైన జాన్‌టోబీ, లెడాకాస్మెటేజ్ లు గమనించారు.

సామాజిక సాన్నిహిత్యా (Social intimacy) నికి ఆంతరంగిక జీవితానికి (priivate life) చుక్కెదురు. సామాజిక సాన్నిహిత్యం ఎక్కువైతే ప్రైవెసీ (privacy) అనేది ఉండదు. నీ విషయాలు అందరికీ తెలిసిపోతాయి. నీయింట్లో ఏకూర వండుకొన్నదీ నలుగురికి తెలిసిపోతుంది. రహస్యం అంటూ ఏదీ ఉండదు. అయినా సామాజిక పారదర్శకత (Social Transparency) కు దాని సుగుణాలు దానికి ఉన్నాయి.

1950ల నాటి కేంద్రక కుటుంబాల (Nuclear families) మీద అమెరికన్లకు మోజు పెరిగింది ఆ కుటుంబాలను, వాటి విలువలతో పాటు, చెక్కు చెదరకుండా పట్టుకురావాలని వారి ఆ కాంక్ష. పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రం ఈ కుటుంబాల విలువలను కొట్టిపారేసింది. ఈ కుటుంబాలలో మారుతండ్రులుంటే, వారికి పిల్లలను దూరంగా ఉంచాలంటోంది ఈ శాస్త్రం. ఎందు కంటే అసలు తండ్రి కంటె మారు తండ్రి పిల్లలిని లైంగికంగా చెడగొడతాడని (child abuse) మార్టిన్ డాలీ, మార్గో విల్సన్ అనే శాస్త్రజ్ఞులు తేల్చారు.

ఆధునిక నాగరకతా నీలి నీడలన్నీ నగరీయత (urbanisation) వల్ల వచ్చాయని చెబుతున్నా 1950ల నాటి నగర సమూహాలు చాల వరకు సామూహిక లక్షణాలనే కలిగి ఉన్నాయి. ఇరుగు

పొరుగు ఎదురు పడకుండా ఎవరి ఇంటిలోకి వారు వెళ్ళ లేరు. కాని కారు గరేజ్ తలుపులు వాటం తటవే తెరుచుకొనే ఏర్పాట్లు వచ్చిన తరవాతత పొరుగువాని ముఖం చూడకుండానే కారులోంచి, ఇంట్లోకి వెళ్తున్నారు.

నేటి ఉపనగరాలు ప్రత్యేకంగా స్త్రీలపై కాఠిన్యం వహించాయి. ఉపనగరాలలో పిల్లలున్న తల్లుల పని మరీ కష్టమైపోయింది. ప్రాచీన సమాజాలలో తల్లులు ఇంటి పనిని, బయటి పనిని అలవోకగా చేసేవారు. ఇంటిపని, బయటి పని మధ్య సమన్వయం బ్రహ్మాండంగా కుదిరేది. వేటమీద జీవించే సమూహాలలో పసిపిల్లలను మేనత్తలు, మేన మామలు, తాతలు, అవ్వలు చూసుకొనేవారు. అసలు పిల్లల పెంపకం ఏ ఒక్కరి చేతిమీదనో జరిగే పని గాదు. అందరూ కలిసే సాకేవారు, అసలది సామూహికం సామాజికం. తనకైతాను ఒంటరిగా తన బిడ్డను సాకే తల్లే నాటి సమాజాలలో మనకు కనిపించదు

1950 ల తరవాత, ఉపనగరీకరణం (suburbanisation) పిల్లలున్న స్త్రీ జీవితాన్నే మార్చివేసింది. ఆమె ఒకరకమైన నిరాశ, నిస్పృహలకు గురైంది ఈ నిస్పృహలోంచే స్త్రీవాదం బయలు దేరిందనిపరిణామ మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు అంటున్నారు ఒకసారి 1959లో, బెటీ ఫ్రైయిడాన్ అనే శాస్త్రవేత్త ఒకస్త్రీని ఇంటర్వ్యూచేసింది. ఆస్త్రీ ఒక ''ప్రశాంత నిస్పృహ'' తో సమాధానాలు చెప్పింది ఆ నిరాశ నిస్పృహలను ఏమని పిలవాలో తెలియక ఫ్రైయిడాన్ తన "Feminine Mystique" 1963) లో ''పేరు లేని సమస్య'' అని పేర్కొంది. దీనిని ఒక డాక్టరు ''గృహిణీ లక్షణ సంపుటి'' (House wife's syndrome)అని పిలిచాడు పిల్లల్ని ఇంటి వద్దే ఉండి సాకే ఆధునిక మాతృమూర్తులు అవసాదానికి గురవడం సహజం. దీని నుంచి బయట పడాలని కోరుకోవడమూ సహజమే.

ఉద్యోగం చేసే తల్లులు ఉద్యోగం చేసే పురుషుల కంటె ఎక్కువగా అవసాదానికి గురి అవుతున్నారు. ఆదిమ సమాజాలతో పోలిస్తే, నేటి తల్లి తన బిడ్డను ముక్కూ మొహం తెలియని వారికి అప్ప చెప్పి పోతున్నారు. ( ఉద్యోగానికి వెళ్ళేముందు తమబిడ్డను ఏ బేబీకేర్ సెంటర్‌కో అప్పజెప్పి వెళ్తున్నారు. ఇది చాల అసహజం. తన బిడ్డకు తాను పూర్తిగా తల్లిని కాలేకపోతున్నానే అనే బాధ ఆమెను కుంగతీస్తోంది. దీనిని ఆ తల్లి అపరాధంగా భావిస్తోంది. '' ఉద్యోగం చేస్తూనే మంచి తల్లిగా ఉండడమెలా ?'' అనేది ఆధునిక సమాజం ఎదుర్కొంటున్న సమస్య.

అనబాంబర్ తన వ్యాసంలో ఉపనగరాల సమస్య చర్చించాడు. ఉపనగరాలన్నీ కార్ల సృష్టే. కార్లు లేకపోతే ఉపనగరాలు లేవు. ఉపనగరాలుండడం వల్లనే దూరం నుంచి నగరాలకు వచ్చి పనిచేస్తున్నారు. ''భ్రష్టనగరం'' (The Lost City) అనే తన గ్రంథంలో ఎరెన్‌హాల్ట్, హెన్రీఫోర్డ్ విరోధాభాసను వర్ణించాడు. కారు కనిపెట్టింది ఫోర్డు. దానిమూలంగానే మధురమైన పట్టణ జీవితం భ్రష్టుపట్టిపోయింది. తను భ్రష్టుపట్టించిన ఆమధుర జీవితాన్ని తిరిగి తెచ్చుకోవాలని, ఫోర్డ్ తన అరవయ్యోయేట, తనుజన్మించిన పట్టణంలాంటి పట్టణాన్ని, గ్రావెల్ రోడ్డుతో, గ్యాస్ దీపాలతో, నిర్మించాడు.

మనషులు సహజంగా ఒకరి మీద ఒకరు ఆధారపడతారు. కాని టెలిఫోన్‌నుంచి రెఫ్రిజిరేటరు దాక, రెడీమేడ్ మైక్రోవేవబుల్ భోజనం దాక వచ్చిన ఎన్నో ఎన్నో సాంకేతిక విజ్ఞాన పరికరాలు

మనుష్యుల మధ్య ఉన్న పరస్పరాధారతను తుడిచిపెట్టాయి ఒక ఇరుగులేదు ఒక పొరుగులేదు. ఒక కప్పు కాఫీ పొడి ప్రక్క ఇంటినుంచి అప్పుగా తీసుకొనే ఆచారం అడుగంటింది. ప్రాచీన సమాజాల్లో అయితే తల్లి పనికి పోతే, ఆమెబిడ్డకు ప్రక్కయింటావిడ పాలిచ్చేది. ఇది మన పల్లెల్లో అక్కడక్కడ అరుదుగానైన కొంతకాలం క్రితంవరకు ఉండేది కాఫీపొడి, పంచదార అప్పుతీసుకోడం ఇప్పటికీ విస్తారంగానే ఉంది. పూర్తిగా ఇతరుల మీద ఆధారపడడం కూడ అంతమంచిది కాదనుకోండి. సాంకేతిక విజ్ఞానశాస్త్రం అందించే సౌకర్యాలు అంతచెడ్డవేమీ కాదు.

మనిషిని ఏకాకిని చేసే టి.వి. : సాంకేతిక విజ్ఞాన శాస్త్రం అందించే అన్ని పరికరాలలోకి మనిషిని ఏకాకిని చేసేది టెలివిజన్. దీనికి తోడు. వి.సి. ఆర్., కో ఆక్సిల్ వైర్ ఉంటే ఇక చెప్పవలసిన దేముంది? సగటు అమెరికన్ వారానికి 28 గంటలు టి.వి చూస్తాడు. టి వి.తో పెట్టుకొన్న ఈ బంధాన్ని అతిక్రమించి ఇతరులతో బంధాలు పెట్టుకోవడం అసాధ్యం. హార్వర్డ్ ఆచార్యుడు. ''బంతిని ఒంటరిగా బౌల్‌చేయడం'' (Bowling alone) అనే వ్యాసంలో ''వి సాంఘిక వినోదం'' (a social entertainment) గురించి చర్చించాడు. ఎలెక్ట్రానిక్ టెక్నాలజీ వైయక్తిక అభిరుచులను సంతృప్తం చేసేమాట నిజమే అయినా, ప్రాచీన, సంప్రదాయక వినోదరూపాలతో సంతృప్తమయ్యే ''సామాజిక తృప్తి'' (Social gratification) ని పణంగా పెట్టవలసి వచ్చింది

''టి.వి.మనలను మరోవిధంగా పాడు చేస్తుందంటాడు,'' పరిణామ సైకియాట్రిస్ట్ రాండాల్ఫ్ నెసె. టి.వి. మనలను '' ఆత్మ సందర్శనం (Self perception) చేసుకోనీయదు. అంటే మనమేమిటో, మనం ఎంతో అని మనలను మనంచూసుకొని ఒక ప్రతిమని వస్తుగతంగా ఏర్పరుచుకోనీయదు. అంటే మనలను మనం వక్రంగా చూసుకొంటాం. అంటే మన ప్రతిమను విరూపించుకొని గాని చూడలేం.సమాజంలో పోటీ సహజం. అందుకని ఇతరులతో పోలిక ఎప్పుడూ ఉంటుంది. అలా పోల్చిచూసుకొన్నప్పుడు కొన్ని రంగాలలో అయినా మన ముందున్నాం అనే తృప్తి ఉండాలి. కాని టి.వి.లో మనం చూసే ఊహాలోక (fantasy) మూర్తుల అంద చందాలతో, వారి జీవితాలతో పోల్చుకొన్నప్పుడు మనం ఎక్కడ నిలబడతాం ? మన చుట్టూ ఉన్న మన తలిదండ్రులూ, కొడుకులూ, కూతుళ్ళూ, భార్యలూ, భర్తలూ అల్పంగా కనిపిస్తారు. వీరెవరూ వారితో పోటీగా ఉండరు. ఆందుకని మనం వీరితో అసంతృప్తి చెందుతాం. అంతేకాదు. మనతో మనమే అసంతృప్తిచెందుతాం.

టి.వి. నుంచి ఉపశాంతి ఇంటర్నెట్‌వల్ల లభించవచ్చు. అయితే ఒక్కోమాటు దీనివల్ల గూడ దుష్ప్రభావాలుంటాయి. ఇంటర్నెట్ అభివృద్ధి చెందిన దేశాలలో బాగా వ్యాప్తిలో ఉంది. మన దేశంలో ఇప్పుడిప్పుడే ప్రవేశించి అంగలు పంగలుగా విస్తరిల్లుతోంది. దీని వలన మనం దూరాన ఉన్న మనుషులను తాకలేకపోతున్నా చూచి వారితోజతకట్ట గలుగుతున్నాం. దూరాన ఉన్న చిన్ననాటి స్నేహితునితో ముచ్చటిస్తున్నాం. ఆటలాడుతున్నాం తాకిచూడడం సాధ్యంకాని కారణాన మనమనస్సుల లోని ''సామాజిక యంత్రాంగం'' పూర్తిగ సంతృప్తంకాదు. నెట్ సమాచారాన్ని విపరీతంగా అందించి ''సమాచార భారాన్ని'' పెంచుతుంది కనుక, దీని వలని మానసిక ప్రభావాలు ఇప్పుడిప్పుడే అంచనా వేయడం సాధ్యంకాదు.

'' ఆధునిక సామాజం విసామాజికం'' (a social) అనే భావనకు ఫ్రాయిడ్ ఆశ్చర్యపోయాడు. పాశవిక వాంఛలకు,వాటిని అణచి పెట్టాలనే సామాజిక ఆదేశాలకు మధ్య ఉన్న తన్యత (tension)

ను చూసి, వాపోయాడు ఫ్రాయిడ్ తన సివిలైజేషన్ అండ్ ఇట్స్‌డిస్‌కంటెంట్స్‌లో. అందులో ఇలా రాస్తాడు. ''పొరుగు వానిని నీకు వలె ప్రేమించు,'' అని చెప్పి సహికరించ మంటుంది సమాజం. కాని స్వభావరీత్యా మనం మన పొరుగువానిని దోచుకొవడానికే తయారు చేయబడ్డాం. అంతేకాదు. అతనిని అవమానించడానికి బాధించడానికి, చివరకు చంపడానికి కూడ వెనకాడం.'' అన బాంబర్ ఇలాగే వాపోతాడు. ఆధునిక సమాజంలో మనం ఎవరిని ద్వేషించక పోవడం సంస్కారమని పించుకొంటుంది. అయినా ప్రతి ఒక్కరూ, ఏదో ఒక సందర్భంలో ఎవరినో ఒకరిని ద్వేషిస్తారు. సమాజం ఒకటి చెబుతుంది. మన సహజ స్వభావం మరొక తీరులో ఉంటుంది. రెండింటికి మధ్య వైరుధ్యం. కనుక మన సహజస్వభావాలు ఈ విధంగా ''అతిభారం'' కావడంతో దానికి దీటుగా జనం అతిసామాజికీ కృతం (Oversocialised) అవుతారు. ఆదిమ మానవునిలో సమాజాల (instincts) ను ఆదిమ సమాజాలు, మన సమాజాలలో లాగ, అణచివేతకు గురిచేయలేదు. సహజాతాలు అణచివేతకు గురికాని ఆదిమమానవుడు నేటి మానవునికంటే సుఖంగా ఉన్నాడనడంలో ఫ్రాయిడ్‌తో అనబాంబర్ ఏకీభవించాడు.

ఆదిమ మానవునిలో సహజజాతాలు అణచివేతకు గురికాలేదనడం సరికాదంటున్నది పరిణామ మనోవిజ్ఞాన శాస్త్రం. ద్వేషం అనేది మన అంతస్స్పర్ధ సామాజిక యంత్రాంగంలో ఒక భాగం అనేమాట నిజం. అంతేకాదు, మనిషి సహజంగా మొరటువాడు. ద్వేషాన్ని, మొరటు తనాన్ని అణచివేసే దాంత శక్తి గూడ మానవ స్వభావంలోని అంతర్భాగమే, ఫ్రాయిడ్ పూర్ణంగా సంతృప్తికరంగా వివరించలేని అపరాధ భావన (guilt) గూడ మానవ స్వభావంలోని అంతర్నిర్మిత దాంత శక్తియే. ఈ అపరాధ భావన ప్రణాళిక ప్రకారమే మన బంధువులను, మిత్రులను, దగ్గరవారిని విస్మరించ కుండ మనలను కాపాడుతుంది అలా విస్మరిస్తే మనలను అపరాధ భావన వెన్నాడుతుంది. కోపంలో త్వరపడి ఎవరినైనా ఏదైనా అన్నా, ఆ కోపం తగ్గిన తరవాత, క్షమాపణ చెప్పుకొంటాం. లేకపోతే అపరాధభావన సహించదు. ఒక్కొమాటు అపరాధభావనా భావంతో, మనం ఎవరి ఎడ తప్పుచేశామో వారి ముఖం వారాల తరబడి చూడలేం. తప్పించుకు తిరుగుతాం. ఆధునిక సమాజం అపరాధభావన భారం పెంచినమాట నిజమే. ఆదిమ సమాజాలలో అపరాధభావన అసలు లేదనికాదు కాని, వారిలో వెంటనే దానిని తుడిచి వేసుకోవడం జరుగుతుంది. చేసిన తప్పుకు క్షణాల్లో శిక్ష పడుతుంది. మనలో లాగ ఏండ్లు పూండ్లు పట్టదు చేసిన తప్పులకు అపరాధభావనను అనుభవించడమనేది ఆధునిక నాగరికతా సృష్టి కాదు.

సహజవరణం (Natural selection) సృష్టించిన ప్రచోదనలు నిజంగా ఆలోచిస్తే, అవి అంత స్వార్థపరమైనవికావు ఉదాహరణకు ప్రేమ, దయ, ఔదార్యం, పశ్చాత్తాపం, స్నేహవాత్సల్యం, విశ్వాసాలు ఇవేవీ స్వార్థాలు కావు. ఇవన్నీ మన జన్యు వారసత్వంలోని భాగాలే. విచిత్రమేమిటంటే సమాజం పాశవిక ప్రచోదనలను అణచివేసినట్లే వీటినీ అణచి వేస్తున్నది. అందుకని ఈ ఆధునిక సమాజంతో ఒక చిక్కు వచ్చిపడింది. ''సామాజిక'' (Social) అనే పదాన్ని సరిగ్గా అర్థం చేసుకొన్నట్లయితే, ఆధునిక సమాజంలో సామాజిక సంస్పర్శ (Social contact) లో ''సామాజికం'' (Social) అనేది చాల తక్కువగా ఉన్నట్లు గ్రహిస్తాం. అంటే ఈనాడు మనం నిత్యం జరిపే మానవ సంబంధాలలో ''సంస్కార, మృదు, స్నిగ్ధ'' భాగం అత్యల్పంగా ఉంటోంది. ఆధునిక నాగరకతలో ''సంస్కారం'' (Civility) కొరవడినట్లు అనేక భావనలు సూచిస్తున్నాయి. ఫ్రాన్సిస్ ఫుకుయామా రాసిన ''నమ్మకం'' (Trust) అనే పుస్తకం

చూస్తే ఆధునిక జీవితంలో లోపించిన దేమిటో అర్థం అవుతుంది. పుస్తకం పేరులో ఉన్నట్లు అది ''నమ్మకం''. ''మాములుగా మేము చాలమందిని నమ్ముతాం'', అని 1960లో 58 శాతం జనాభా చెబితే, 1990 వచ్చేసరికి అది 37 శాతానికి పడిపోయింది ఇది బాధాకరమే.

పరిణామ మనోవిజ్ఞానశాస్త్రం ప్రకారం మనం విశ్వసనీయమైన సంబంధాలను పెంచుకోవాలి పెంచుకోలేక పోతే బాధపడాలి. ''సాంకేతిక విజ్ఞాన ప్రభావిత ఆర్థికత'' మన ఆధునికి ప్రపంచాన్ని ఏలుతోంది. అసలు తీరికే ఉండదు ఉన్న తీరిక సమయాన్ని ఎలెక్ట్రానిక్‌గా ( టి. వి. ఇంటర్నెట్ వగైరాలు) గడుపుతున్నాము సామాజికంగా (Social) స్నేహసంబంధాలు పెంచుకోవలసిన సమయాన్ని వృత్తి సంబంధాలతో నింపుతున్నాం. సంబంధాలలో ''స్నేహ పిచ్ఛలత'' ఉండాల్సింది పోయి ''పని'' సంబంధాలుగా మారిపోతున్నాయి.

మరి ఇటువంటి ఆధునిక జీవనాన్ని సరిదిద్దే మార్గాలేమైన ఉన్నాయా? సరిదిద్దాలను కొనేవారికి పరిణామ మనో విజ్ఞానశాస్త్రం కొంతవరకు దారి చూపుతుంది. బేబీకేర్ సెంటర్స్ పూర్తిగా జీతాల మీద పనిచేసేవారి మీద ఆధారపడతాయి. తల్లులు పిల్లలను అటువంటి కేంద్రాలకు అప్పచెప్పి తమ ఉద్యోగాలకు వెళతారు. ఇది మంచి పనికాదు కొంతసేపైనా తలిదండ్రులు ఆకేంద్రాలలో పనిచేయాలి అంటాడు అమితాయ్ ఇత్జోని. ''పిల్లలకు గృహవాతావరణం మంచిది''. అంటాడతడు తను రాసిన The Spirit of community అనే గ్రంథంలో. ఇలా అనడంలో అతడు తల్లులలోను, పిల్లలలోను ఉన్న అంతస్సిద్ధ సామాజిక స్వభావాన్ని మరిచాడేమో అనిపిస్తుంది. తల్లులకు సహజంగానే మాతృత్వ, వృత్తి స్వభావాలు రెండూ ఉంటాయి కనుక, పనిచేసే చోటే పిల్లల్ని సాకే కేంద్రాలుంటే బాగుంటుందేమో.

ఇహ నివాసగృహ నిర్మాణంలో గూడా మానవస్వభావాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. అంటే '' ఇరుగు పొరుగు'' (Neighbourhood) భావనను దృష్టిలో ఉంచుకొని గృహనిర్మాణం చేయాలి. కొన్నిచోట్ల అయితే, ఈ భావనతోనే, పెద్ద పెద్ద ఉమ్మడి వినోదకేంద్రాలను, విశాలమైన రోడ్లప్రక్క కాలిబాటలను, కారు తిన్నగా ఇంటిలోకి పోవడానికి వీలులేకుండా మధ్య గరిక ప్రదేశాలను వదలడం - లాంటి వాటితో ఇరుగు పొరుగు భావనకు దోహదం చేస్తున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే కారులో లోపలికి వెళ్ళగల వేట-సంచక (Hunter - gather) గ్రామాలను నిర్మిస్తున్నారు. ఇటుక -సున్నంలో భౌతికంగా గృహనిర్మాణాలు చేసినంతమాత్రాన ఆదిమ సమాజ పరిసరాన్ని పట్టుకు రాలేరు. భౌతికంగా సన్నిహితమైన గృహాలు, గజిబిజిగా అల్లుకుపోయిన సామాజిక సంబంధాను ఎలా పునరుద్ధరించగలరు? పిల్లల పెంపకానికి అద్భుతంగా తోడ్పడిన నాటి సమూహ సంబంధాలు ఇప్పుడెలావస్తాయి. ఒక వేళ అటువంటి స్నేహ పిచ్ఛల, కవోష్ణ సంబంధాలను తిరిగి నెలకొలపినా, ఈ నాటి మానవుడు బయటకు వెళ్ళి 10 గంటలు పనిచేయక తప్పదు కదా. టెలికమ్యూనికేటింగ్‌తో ఇంటిలో కూచొని పనిచేద్దామనుకొన్నా అతడు 10 గంటలు ఇంటిలోపలే ఉంటే పొరుగును ఎట్లా సంపాదించకోగలడు? వ్యవధి ఏది? ఎవరి పని వారిదే.

నాటి సంబంధాల పునరుద్ధరణకు అవరోధం పెట్టుబడిదారీ విధానం. ఇది సమాజవ్యతిరేక సాంకేతిక విజ్ఞాన పరికరాలను - టి.వి.లను, కార్లను - ''జనం మీదికి ''కక్కి'' వేస్తుంది. మనుషుల్ని వృత్తిపరమైన పేటికలుగా తయారుచేసి ఒకరి కొకరిని దూరంగా విసరివేస్తుంది. నగరాల్లో '' ఆర్థిక మెసులుబాటు'' ఎక్కువగా ఉండడం వలన వ్యవసాయదారులు, కూలీలు నగరాలకు పల్లెలనుంచి ఆకర్షితులవుతున్నారు. దానితో కుటుంబాలు ముక్కలు చెక్కలు

అవుతున్నాయి. కుటుంబ విలువలకు స్వేచ్ఛా విపణికి పొత్తుకుదరక పోవడంతో, కుటుంబ విలువలకు తిలోదకాలివ్వడం జరుగుతోంది ఒక ప్రక్క- సాంప్రదాయిక విలువలను పొగడుతూనే. మరో ప్రక్క- ఆర్థిక సాంకేతిక ప్రగతిని బలపరుస్తున్నాం. ఆర్థికస్వేచ్ఛలోని గతి శీలతకు మానసిక రుగ్మతలకు ముడి ఉంది. ఆధునిక మానసిక రుగ్మతలను నయం చేయడానికి పెట్టుబడి దారీ విధానం ప్రతిపాదించిన చర్యలేవీ పని చేయడం లేదు. ఆధునికీకరణ (Modernisation) వలన కలిగే సమాజ వ్యతిరేక ఫలితాలను అడ్డుకొనే సంస్కరణలు చాల ఖరీదైనవి. అందుకని అవి ఆచరణ యోగ్యాలు కావు. ఆర్థిక ప్రగతి నిజంగా సమాజం మీద అంత భారం మోపుతూంటే ప్రగతినే కొంత తగ్గించుకొంటే పోలా?

అంతే కాదు, మానసికంగా ఈ ప్రగతికి మనం ఎంతమూల్యం చెల్లిస్తున్నాం? మనం మన భౌతిక సంక్షేమాన్ని ఇతరుల సంపదతో పోల్చుకొని తృప్తో, అసంతృప్తో చెందుతాం. అంతేకాని, ఏ పరమ ప్రమాణంతోనో పోల్చుకోము, అందుకని మన పొరుగు వాడు బాగా పెరగకుంటే మన కేం బాధలేదుగదా. అమెరికా తలసరి ఆదాయం 1957 నుంచి 1990 కి రెట్టింపు అయింది. ఆ నాడు మేము చాల సుఖంగా ఉన్నామని మూడోవంతు అమెరికన్లు చెప్పారు అదే 1990 లోనూ మూడోవంతుమందే చెప్పారు ఈ విషయాన్ని డేవిడ్ మేయర్ తన " (Pursuit of Happiness) అనే గ్రంథంలో చెప్పాడు. కనుక మన ''అంతర్గత గాఢ అవసరాలకు'' తలసరి ఆదాయం పెంపు సమాధానంకాదు. '' ఇంకొంచెం ఉంటే బాగుంటుంది. ఇంకొంచెం ఉంటే బాగుంటుంది'' అని ప్రతి మానవుడు అనుకొంటూ ఉంటాడు'', అని How to count what you have", అనే గ్రంథంలో తమోతి మిలర్ రాశారు. ''తమకు ఏదికావాలో అది దాదాపు సరిపోయినంతగా ఉంది. అనే నమ్మకంతో ప్రజలు జీవిస్తూ ఉంటారు. ఇంకొంచెం ఉంటే వారు అందలం ఎక్కుతారు. అప్పుడిహ వారు ఎప్పటికీ తృప్తి చెందుతారు'',- ఇది మన మనస్సులలోకి ''సహజవరణం'' ఎక్కించిన ''అంతర్నిర్మిత భ్రాంతి'' అంటాడు మిలర్.

అందుకని నిరంతరం, తరువాతి తరానికి మానవుడి జన్యుసంక్రమణానికి అవకాశాలు మెరుగు పరుస్తూ, పెనగులాడడానికే ఈ భ్రాంతి ఉద్దేశితమైంది. ఆధునిక పరిసరంలో - ప్రాచీన పరిసరంలో వలె కాక గర్భనిరోధ పద్ధతులు ఉన్న ఈ పరిసరంలో భౌతిక ఆర్జనపెంపర్లాటలో ఆ భ్రాంతి ప్రభావం మృగ్యమైంది. మనం అత్యధిక జన్యువిస్తరణను లేదా భౌతిక ఆర్జనను నిరంతరం ఎందుకు చేపట్టాలి? మానవ మనస్సును సృష్టించిన ప్రక్రియ ' ఎ' జెండాలో అవి ముందున్నాయి.

సహజవరణం మంచికో చెడుకో మన సృష్టికర్త. కాని అది దేవుడు కాదు. అది మన మనస్సులో నాటిన ప్రచోదనలు అనివార్యంగా మంచిని ఏమీ కావు. వాటిని నివారించడం మానవతీతమూ కాదు.'' ఇంకా కావాలి, ఇంకా కావాలి'' అనే ఆరాటం ఇరుగు పొరుగును అర్థం చేసుకోనీయదు. మన బంధు మిత్రులను ప్రేమించ నీయదు స్నేహ పిచ్ఛలమైన మృదుమానవ సంబంధాలను పెంపొందించుకొనే మానవప్రవృత్తిని అలవరుచుకోనీయదు. ఇటువంటి మానవ స్వభావాన్ని శాస్త్రం ఇప్పుడిప్పుడే అర్థంచేసుకోవడం మొదలు పెట్టింది.

# 'శ్రీమతి' అడివి బాపిరాజుతో మధుర వాణి

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

మధురవాణి : మిమ్మల్ని శ్రీమతి బాపిరాజు అని మీ సన్నిహిత మిత్రులు కోలవెన్ను రామకోటేశ్వరరావు గారూ వగైరా పిలిచే వారట, నిజమా? అదేవిటి ఆ చేతులు తిప్పుకోవడం?

బాపి రాజు : నాకు మైక్రోఫోను ఓ అందమైన అమ్మాయిలా కనిపిస్తుంది చెప్పొద్దూ - జీవితంలో సౌందర్య పిపాస గురించి రేడియోలో ఏదో మాట్లాడా.

మధురవాణి : మీతో కలిసి తిరగడం ఒక వింత అనుభవం అంటారు ఆచంట జానకిరామ్. ప్రతి మాటకూ ఆవేశం చెందుతారట. ఉద్వేగం కూడా చెప్ప నలవి కాదు మీకళ్ళ ముందు ఎప్పుడూ ఒక అద్భుతమైన సుందరాతిసుందర దృశ్యం ఎవరు సృష్టించ గలరు?

బాపిరాజు : నా బ్రతు కొక పరిమళార్ద్ర నందనోద్యానము

మధురవాణి : మిమ్మల్ని పెద్దలంతా బాపి బావ అంటారుట, అన్నట్లు మీకు, విశ్వనాథ సత్యనారాయణ గారికి ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు వెయ్యి నూట పదార్లను కాబోలు చెరి సగం చేసి యిచ్చారుట - బహుమతీ. వేయిపడగలు నవలకు, నారాయణరావుకీ - మీ కేమీ స్పర్థలు రాలేదు కదా?

బాపిరాజు : మేమంతా మన్మథ సంవత్సరంలో పుట్టి కవుల మైనాం.

మధురవాణి : మన్మధ సంవత్సరంలో పుట్టి కవులమైనామంటా రేమిటి? అందమైన వాళ్ళు కావాలి గాని

బాపిరాజు : నీ మాట ప్రకారం మరి దుర్ముఖిలో పుట్టినవాళ్ళు ఏమి కావాలి?

మధురవాణి : కాల పురుషుడు ఉల్లాసంగా వున్నప్పుడు పుట్టి వుంటారు మీరు. మీ వంటి వారు (కాటూరి, విశ్వనాథ, బాపిరాజు) అంతా పూర్వం ఏ కాలంలోనూ ఏక కాలంలో దర్శన మిచ్చి వుండ రనుకుంటా.

బాపి రాజు :

నువ్వునేనూ కలసి
పువ్వులో తేనెలా
నువ్వు నేనూ కలసి
కోకిల గొంతులా
గొంతులో పాటలా!
నువ్వు నేనూ కలసి
వెన్నెల వెలుగులా
వెలుగులో వాంఛలా
నువ్వునేనూ కలసి
గగన నీలానిలా
నీలాన శాంతిలా (సన్నగా పాడతాడు)

మధురవాణి : నువ్వూ నేనూ కలసి అని తెగ పలవరిస్తున్నారు ఆమె మీ ఊహా ప్రేయసి శశికళ కాదు గదా! అన్నట్లు మీరు మిత్రుల యిళ్ళకు వెళ్ళినప్పుడు తల సావిడిలో

నిలవక సరాసరి వంట యింటిలోకి వెళ్ళి వాళ్ళ వంట పనుల్లో కూడా చేయి చేసుకునే వారట. మీ ప్రియురాలు అలకాపురి వాసి కాదు కదా!

బాపిరాజు : భోగీర లోయ సహా చైత్యాల ప్రవాసి యైన శిల్ప సుందరిలో నే నామెనే పొడగన్నాను. శిల్పాలు, చిత్ర లేఖనాలు, సంగీత సాహిత్యాంలో ఆమె విలాసాలనే తొంగిచూశా. పురాస్మృతుల్ని రేపుతుందే కాని ఆ శశికళా దేవివలె నన్ను పల్కరించదు. నేనెంత అలమటించినా, చీదరపడి శివమెత్తి ఆమె కోసం తిరిగినా చివరికి ''నీకు ఇవతలా, నాకు అవతలా తెర యున్నదె బాలా'' అని వాపోయా. ఈమె నా ఊహా సుందరి ఆవిడనే కృష్ణశాస్త్రి, టాగూరు ' ఊర్వశి' అన్నారు. ఆమె యభవ, ఆమె సద్యో యౌవన, ఆమె అయోనిజ, ఆమె ఎవరకీ ఎంత వలచినా గృహిణి కాదు.

మధురవాణి : అతీంద్రియ భోగ్యమైన ఆ వస్తువు ఆలింగమున యిముడునా? ఇముడ దని రవి కవే అన్నాడు. మీ కళాకారులందరిలో స్త్రీ ప్రకృతికెక్కువ పాళ్ళుంటాయి. (పురాణం గారిలో స్త్రీ పాళ్ళెక్కువయే ఇల్లాలి ముచ్చట్లురాశారు) స్వామీ మీకు వ్యవహార దక్షత కూడా తక్కువే నని కాటూరి వారన్నారు. లాయరుగా, అధ్యాపకుడుగా, పత్రికా సంపాదకుడుగా దేంట్లోనూ మీరు దక్షుడనిపించుకో లేదట.

బాపిరాజు : కళా సృష్టి లేని చోట నాహృదయం రమించదు.

మధురవాణి : స్వామీ మీరు ప్రయోజకుడయితే మా బాపిరాజు, బాపిబావ కాకుండా పోయేవారు - కల్ల కపటం లేని పని వాని వంటి వారు. మీ అమాయ కత్వంతో మీరు లోకాన్ని జయించారు. కర్మం చాలక ఎవరేనా వకాలతు ఇచ్చినామీరు ముష్టి లక్ష్మీనారాయణ తోటలో పుష్ప జాతుల్ని గూర్చి చేతులు త్రిప్పుతూ ప్రసంగం చేస్తూ వుండేవారు. ఎలాగో మిమ్మల్ని పట్టుకుని కోటు పాగా తగిలించి కోర్టులో కూర్చోపెడితే మీ ముసిముసి నవ్వుల్ని చూసి మీ ప్రతిపక్ష వకీ లేదయినా అడిగేవాడు. సబ్‌జడ్జి కూడా బాపిరాజు గారూ! ఎంత వరకు వచ్చింది మీ నవల అని అడిగే వాడు నవ్వుతూ, జేబులో డబ్బు వేసుకొని పిల్లడి జ్వరానికి మందు కొనడానికి బజారు కెళ్ళిన మీరు ఆ సొమ్ముతో ఏ నక్కపల్లి బొమ్మలో, కాళహస్తి కంచు విగ్రహమో కొనుక్కొచ్చే వారు. ఆ బొమ్మల పని తనం ప్రాశస్త్యం గురించి లెక్చర్ లిచ్చేవారు. ఆలివర్ గోల్డ్‌స్మిత్తు మళ్లీ మీలా అవతరించాడని అంతా అనుకునేవారట.

బాపిరాజు : నేను పిల్లల ప్రపంచంలో యిట్టే యిమిడి పోతాను. నాకు పిల్లల పోషణ వగైరాలన్నీవచ్చు, ఎలాటి మంకురు బిడ్డ కానీ నా బుజాల మీదకు పాకవలసిందే, నేను వారితో ఆడతా, పాడతా-

మధురవాణి : మీరు పసి వారు కాబట్టి పసి వాళ్ళతో యిట్టే కలిసిపోయేవారు.

బాపిరాజు : పిల్లలకు వలెనే నాకు కొత్త వాళ్ళుంటే కాస్త బెరుకు, చప్పున కలవలేను ఎందుకో, నా పాండిత్యం అంతా గురుముఖతా నేర్చుకున్నది కాదు.

మధురవాణి : సభలలో రక్తి తగ్గినపుడు పిలవండి బాపిరాజును అనే వారట గదా అప్పుడు మీరు- గవళ్ళ పెల్లాయి కూతురు కడు చక్కనిదని సూతురు, అని ఎత్తుకంటే అంతా ముసి ముసి నవ్వులేట! అవును ఇంతకీ మీ గురువు గారు ఎవరు?

బాపిరాజు : ప్రమోద కుమార చటర్జీ. వారికి ముందు రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా వున్న కూర్మ్రే దొరగారు.

మధురవాణి : అవును మిమ్మల్ని కులపతి అడివి బాపిరాజు గారని పిలుస్తారు. కులపతి అంటే యిటీవల ఎన్.టి. ఆర్ గారు సాధించిన కులపతి కాదు గదా కొంపదీసి?

బాపిరాజు : సాహిత్యం, చిత్ర లేఖనం, శిల్పం, సంగీతం, నాట్యం యీ అయిదు కళలు ఎంత సన్నిహితమైన వంటే పంచనదీ పరివేష్టిత మైన పంజాబు వంటిది కళ.

మధురవాణి : కోనంగి నవల లోని కొంటి కోనంగి మేరే నటగా మీ హాస్యానికి ఆంధ్ర దేశమంతా వేదికట కదా?

బాపిబావ : కొంత స్వానుభవం కూడా వున్నదనుకో.

మధురవాణి : కవులు మీరు చిత్రకారుడనీ చిత్రకారులు మీరు కవి అనీ మీకు రావలసిన కీర్తి దక్క కుండా చేసే వారట, ఎంత వరకు నిజం.

బాపి బావ : అది ఒక చమత్కారం అంతే. శశిని ఒక తల్లికీ మరో తల్లికి కళనూ పంచియిస్తానని అన్నా. చంద్రుడు కవిత్వానికి అధిపతి, వెన్నెలంతా కవిత్వమ్. సూర్యుడు వర్ణపతి చిత్రలేఖనానికి అధిపతి.

మధురవాణి : బావుంది సూర్యుడ్ని ఒకరికీ చంద్రుడ్ని ఒకరికీ యిచ్చారన్న మాట. అయితే శశికళను భువి నుండి దివికి పంపారు గాని అక్కడిది యిక్కడకు తేలేదన్న మాట.

'అతడు గీసిన గీత బొమ్మై
అతడు పలికిన పలుకు పాటై
అతని హృదయములోని మెత్తన
అర్థవత్పృకృతియై ' అన్నారు విశ్వనాథ

బాపిబావ : నాభార్యకు చిన్నప్పుడే నెర్వస్ బ్రేకడవున్ వల్ల కదల లేని స్థితి, నన్నెప్పుడూ తన దగ్గర చూచోమని అడిగేది, మా అమ్మాయికి పోలియో వచ్చి చిన్న తనంలోనడక పోయింది. అయినా ఆ పిల్లకు కావలసిన ఆత్మ శక్తిని సమకూర్చా.

మధురవాణి : పిల్లల్ని కనడం ఒక్కటి చేతగాదు కాని మీరు ముమ్మూర్తులా స్త్రీయేనని అనేవారట కాటూరి వెంటేశ్వరరావుగారు. మీ నోట్లో ఆడ వాళ్ళకి మల్లే నువ్వుగింజ నానదట ' ఎండి మియాన్' కథేమిటి స్వామీ!

బాపిరాజు : ఆస్వాల్డ్ కూర్మ్రే గారితో అజంతా, ఎల్లోరా గుహలు తిరిగి తిరిగి ప్రకృతి సౌందర్యం వెల్లి గొన్న తావేదో వెతుకులాడాను. ఆ అన్వేషణలో ఒక రాత్రి పాపి కొండల మీద ఒక అడివిలో చిక్కడ్డాము. అక్కడ అన్నీ లతాని కుంజాలే, పారే సెలయేళ్ళ పక్కన తల లూపుతున్న ఎత్తయిన ఒత్తయిన చెట్లు, అక్కడక్కడా రాతి బండలు, వాటి మీద ప్రతిఫలించే పండు వెన్నెల. అలసి సొలసి నేను అల్లంత దూరాన ఓ రాతిబండ మీద మేనువాల్చి చల్ల గాలికి నిద్రలోకి జారా. తర్వాత చెప్పారు. అప్పుడు కూర్మ్రేదొరగారు ఒక అద్భుతమైన దృశ్యం చూశారట. ఆ వెన్నెల అంతా ఒక స్త్రీ మూర్తిలా రూపుగొని బాపిరాజు గారిమీద వాలిపోయిందట. ఆదృశ్యాన్ని కూర్మ్రేదొరగారు బొమ్మ కెక్కించి నాకు

బహూకరించారు. అదే ' ఎండిమియాన్'

మధురవాణి : దాని మీద మీరు రాసిన పాట వినిపించరూ?

బాపిరాజు : పాడుగైన పాట.

చంద్రలోకం తూర్పు దెసలో
సూర్యలోకం పశ్చిమంలో
చిన్నిలోకం ఒకటి ఉన్నాదే
ఓనా వెన్నెలా చిన్నారి పడుచా
ఆలోకమేలే కన్నెరాశివి
నువ్వే నువ్వేనే
ఆమే శశికళ.

మధురవాణి తెలుగు భాషకు ఆ భాషా మాధుర్యానికి చక్కగా సేవచేసిన షట్చక్రవర్తులు ఎవరు అనే ప్రశ్నవస్తే చిలకమర్తిలక్ష్మీ నరసింహం, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి, అడివి బాపిరాజు, మల్లాది రామకృష్ణశాస్త్రి అంటారు. స్వామీ! మీ వేషం ఏలా వుండేది?

బాపిరాజు ఏంవుంది. ఖద్దరు పంచె, ఖద్దరు లాల్చీ, పైన ఉత్తరీయం, దువ్వని శిరోజాలు, కాళ్లకు బందరు చెప్పులు - యిదీ నా వాలకం.

మధురవాణి స్వాతంత్రోద్యమంలో కారాగార క్లేశం అనుభవించారట గదా! మీ కైవరైనా మిత్రులు డబ్బిస్తే, దాన్ని ఎదురైన కుచేల మిత్రుల చేతుల్లో పెట్టి నిర్వి చారంగా యింటికి వచ్చేవారట నాటి తెలుగు సాహితీ వనంలో మీరో రసాల వృక్షంలా నిలబడి అన్ని వైపులకు చేతులు సాచారు. మీకు స్వర్ణాభిషేకం జరిగిందిట! 'నాకు గురుత్వం వహించిన నా శిష్యు'లని కూర్ద్రే దొరగారు ఒక పుస్తకాన్ని మీకు అంకితం చేశారట. ఎంత అదృష్టం? మీరు విశ్వనాథ వారు సూర్య చంద్రుల వంటి వారు తెలుగు సాహిత్యాభిమానులకు.

బాపిరాజు పూర్వ కవుల ఆఖరు కాపుశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, నవ్య కవుల ప్రథమ సంతానం రాయప్రోలు సుబ్బారావు, ఆ తర్వాత శ్రీశ్రీ నవ్య కవిత్వంలో వంకరకొమ్మ.

మధురవాణి హైదరాబాద్‌లో మీజాన్ పత్రిక నడిపే వారట, ఒక రకంగా పత్రికల్లో సీరియల్ నవలా రచనకు ఆద్యులు మీరేనట, మీజాన్‌లో సినిమా కాలం ప్రవేశపెట్టింది మీరేనటగా.

ఆ కాశ మల్లెదీవి
ఆ మల్లెపూల తావి
అల్లడుగో బావ చూడు
అల్లారు ముద్దబావ, అడివి బాపిబావ.

బాపిరాజు ఖాన్ బహదూర్ అహ్మద్ నవాజ్ జంగు అల్లుడైన గులాం మహ్మద్ కలకత్తా వాలా 'మీజాన్' పేరుతో మూడు పత్రికలు పెట్టాడు. ఇంగ్లీషు, ఉరుదూ, తెలుగూ. మూడు మూడు విధానాలు, తెలుగు మీజాన్ మాత్రం నిజాం వ్యతిరేక శక్తులను సమర్థించేది. ఆంధ్ర మహా సభను సమర్థించేది. ఓ మాటు శివ

శంకర స్వామి గారు మా ఆఫీసు కొచ్చిచూసి యిలాటి వాళ్ళను పెట్టుకున్నావేమిటోయ్ అని గట్టిగా విమర్శించారు. నేను మా సిబ్బందిని సమర్థించాలి గదా. ఇలా అన్నా. వీణ ఎలావుంటుంది? ఒకతీగ షడ్జమం పలుకుతుంది, మరొకటి రిష భం పలుకుతుంది. ఇంకొకటి గాంధారం, నాల్గోది దైవతం, మరొకటి మధ్యమం, ఆరవది నిషాదం. ఏడవది పంచమం, సరిగమపదని, ఈ వరుసలో సప్తస్వరాలు పలికితేనే వీణ. కనుకనే సప్త తంత్రి అన్నారు దానిని, నా స్టాఫ్ కూడా వీణ వంటి వారు. అంతా కలిసి పత్రికను తయారు చేస్తారు. నా కిష్టమైనవే వుండాలి. తక్కినవి వద్దు అంటే ఎలా?

మధురవాణి : మీరు మీ స్టాఫ్‌ను సమర్థించిన వైనం అమోఘం. ''ఓ పలనాటి ఎలమందా, పలవరిస్తావా జైలు కొట్లల్లో!'' అని పాడితే పరిసరాలన్నీ మారుమ్రోగేవి. అలాగే ''లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా!'' అని పాడితే జనాలు ఉర్రూతలూగే వారట కదా! ఒక సారి అడివి బాపిరాజు గాంధీజీ వంటివాడు అని పడటానికి బదులు 'గాంధీజీ వంట వాడు' అని పడిందట ఓ పత్రికలో, నిజమేనా?

బాపిరాజు : నేను నిజంగా మంచి వంటవాడినే.

మధురవాణి : అన్నట్లు మీరు వ్రాసిన '' ఉప్పొంగి పోయింది గోదావరీ తాను తెప్పున్న ఎగసింది గోదావరీ,'' అందరికీ వచ్చు.

బాపిరాజు : ఓ మాటు మా అమ్మ జైల్లో వున్న నన్ను చూడ్డానికి వచ్చి కంట తడిపెట్టింది.

మధురవాణి : అప్పుడు మీరు చెప్పినగేయం - 'కటకటాల చేయిచాచి, కౌగలించి బొజ్జతడుము అమ్మచేయి అమృత రేఖ, అమ్మ ప్రేమ ఆర్ణవమే నన్నారు నాకు గుర్తు. మీ భార్య జైల్లో మిమ్మల్ని చూడ్డానికి ఖద్దరు చీరె కట్టుకు రాలేదని మీరావెంతో మాట్లాడలేదట, పాపం.

బాపిరాజు : తెలుగు వారికి నేటికీ తెలుగు వారిమీదా, తెలుగు తనంమీదా అభిమానం లేదని చాలా ఆవేదనపడ్డా.

'తెలుగు తనము జారిపోయిన
తెలివి మాలిన తెలుగువాడా
పేరు మార్చుకు దారి నడువుమురా
నీ దారిలో నే ఊరిపోవుమురా' అనిరాశా,

మధురవాణి : మీగేయం 'డూడూ బసవన్నా' ఎలా మర్చిపోడం? మీ బొమ్మల గురించి చెప్పండి

బాపిరాజు : జైల్లో వేసినవిగాక ద్వారం వెంకట స్వామి నాయుడు గారి వయోలిన్ కచ్చేరీ, రామప్ప దేవాలయంలో నాగినీ నృత్యం, సాలార్‌జంగ్ మ్యూజియంలో నవాబుల హుక్కా, నా పెనసలు స్కెచ్‌లు కూడా చాలా పేరు పొందాయి. దామెర్ల రామారావుగారు, కవి కొండల వెంకటరావు గారు నా సతీర్థులు, నా శబ్ద బ్రహ్మ చిత్రం డెన్మార్క్- చిత్ర ప్రదర్శన శాలలోవుంది.

ఆంధ్రుల ప్రతిభ ఆంధ్రుల కీర్తి
ఆఖరు కాదని ఆరిపోవదని
మోగింపమ్మా జయజయఢంకా
తెలుగుగానమూ, తెలుగు నాట్యమూ
తెలుగురంగులూ, తెలుగు తేనెలూ
ఆగిపోదనీ అందం వీడదని
రూపంచెడదనీ, రుచులు తగ్గవనీ
మోగింపమ్మా జయజయఢంకా

మధురవాణి : విశ్వనాథ వారు మీతో 'బావా నీకున్నంత భావనాశక్తి నాకు లేదోయీ! నాకున్న భాషా పాటవము నీకు లేదు! అంటే మీరు నవ్వేసేవారట, విచారించ కుండా యితరులు చెప్పేది నమ్మటం అనే లక్షణం మీలో ఉండేదట. విశ్వనాథ వారికీ మీకూ తేడాలు యిందువల్లే వచ్చాయట.

బాపిరాజు : ఇదేమిటోయి అని వారనగానే నవ్వేసి మర్చిపోయేవాడిని. 1935-39లలో బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగా చాలా పనిచేశాను దాని అభివృద్ధికి. అప్పుడు కాటూరి వెంకటేశ్వరరావు గారు తెలుగు అధ్యాపకులు, మా యిద్దరి కలయిక ప్రకృతి పురుషుల కలయిక వలె వుండేది. మాకు 'ముట్నూరి' వారు గురుదేవులు

మధురవాణి : మీ ఇంటి పేరు 'అడివి' అయినా మీ సాహిత్యం నందనవనం. మీ సహచర్యంతో నవ్య సాహిత్యంలో బసవరాజు, బాపిరాజు, నండూరి సుబ్బారావు గారలు గేయ కవిత్రయం.

బాపిరాజు : నా గేయాలింకా అముద్రితంగా వున్నాయి, రాధా వసంత వద్ద ఉన్నాయి. నేను 'మధురవాణి' అనే నవల రాశా. తంజావూరు నాయక రాజుల్లో ప్రముఖుడైన రఘునాథ నాయకుని ఊరేగింపుతో యీ నవల ప్రారంభం అవుతుంది. కథంతా రఘునాథ నాయకుడు మధురవాణిల చుట్టూ తిరుగుతుంది.

మధురవాణి : త్రివేణికి సహాయ సంపాదకుడుగా కొన్నాళ్ళు పనిచేశారట. సతీ అనసూయ-ధ్రువ విజయం (1935) మీరా బాయి (1940) కళాదర్శకత్వం వహించారట, మీకు చిత్రకళ పిలిస్తే పలికే దివ్య శక్తి వుందని గూడూరి నమశ్శివాయ అనేవాడు. ముట్నూరు కృష్ణారావుగారు మీ కళాతృష్ణను చూసి మీకు 'కులపతి' అనే బిరుదు యిచ్చారట! ఆంధ్ర జాతీయ కళాశాలను ఆదర్శవంతమైన గురుకులంగా తీర్చిదిద్దారుట. మీ ఆఖరి రోజుల్లో ఏ వన్నా ఆర్థికమైన యిబ్బందులు ఎదుర్కొన్నారా?

బాపిరాజు : లేదు, ప్రాస్ట్రేటిక్టమీ ఆపరేషన్ కోసం రాయపేట హాస్పిటల్‌లో ఎడ్మిట్ కాగానే మా తమ్ముడు అడివి సత్యనారాయణ కొంత డబ్బుతో మద్రాసు వచ్చి నా దగ్గరే వున్నాడు. డ్యాక్టర్ ఎ.యస్. రామకృష్ణ ఆపరేషన్ చేస్తే నా మేనల్లుడు, డ్యాక్టరు బుద్ధవరపు కృష్ణారావు డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు తోడు వున్నారు. పూర్తి ఆరోగ్యం వచ్చింది. నారాయణరావు నవల అచ్చు వేయించుకుంటున్నా. నారాయణరావు వల్ల వచ్చిన డబ్బుతో నా ఆఖరి రోజులు నిశ్చింతగా ప్రశాంతంగా గడిచాయి.

మధురవాణి : మిమ్మల్ని గుర్తుంచు కోకపోవడం, మిమ్మలి మరిచిపోయినట్లు నటించడం, మీ ఆర్ట్ ఆల్బములు కూడా ప్రకటించక పోవడం, మేం ఎటువంటి దుర్దశలో వున్నామో చెప్పడానికి తార్కాణం.

బాపిరాజు :
నువ్వటే, నువ్వటే
పువ్వు వంటి వయసు
నవ్వులాంటి సొగసు
రువ్వి నాయెదపైన
పరు

# ఓ పువ్వు పూసింది

– చలం

అర్ధరాత్రి అడివిలో పువ్వు పూసింది. చుట్టూ చీకటిని చూసి, భయమేసి, 'అమ్మా' అని ఏడ్చింది ఆకులూ, తొడిమలూ దగ్గరగా తీసుకుని భయం లేదని వూయించాయి ఆ తెల్లని పసి పువ్వుని.

'' ఏదీ ?'' అంది పువ్వు,

'' ఎవరు?'' అంది తల్లితీగ చీకట్లోంచి.

'' నన్ను నీ దగ్గిరికి తీసుకు వొచ్చాడూ - అతను.''

''ఎవరు తీసుకొచ్చారు? నేను తెచ్చుకున్నాను నిన్ను; నా గారాబాన్ని, నా బంగారాన్ని, నా ముద్దుల మురిపాన్ని, నిన్ను ''

''నువ్వేనా? ఎవరో అనుకున్నాను, నువ్వేనా నా చేతిని పట్టుకుని నక్షత్రాల మధ్య నించి ఆడుతో, నవ్వుతో, అట్లా తేలివొచ్చి నన్నిక్కడ దించింది? ఓ సారి కనపడు ! ''

''తెల్లారనీ, నన్ను చూద్దుగాని, ఇప్పుడు పడుకో.''

''భయమేస్తోంది. కిందికి పడిపోతానా?''

''నేను పట్టుకున్నాను కదూ!''

''ఆకలేస్తోంది అమ్మా!''

పువ్వునోట్లోకి వెచ్చగా, తియ్యగా, వొంటినంతా సంతోషంతో నింపుతో పాలు వొచ్చాయి.

''వొచ్చావా?'' అని వొళ్లో పెట్టుకుని వూపింది గాలి.

''అమ్మా! ఏమిటి అట్లా పాకుతోంది నా వెనక?''

'' ఏం లేదు; అది పాము. తిండి కోసం తిరుగుతోంది.''

''నన్ను తింటుందా ?''

''నిన్నెందుకు తింటుంది? చాలా మంచిది. పిట్ట పిల్లల్ని తింటుంది! మన జోలికి రాదు ''

పెద్ద పెద్ద చెట్ల వెనక నించి అర్ధచంద్రోదయ మౌతోంది. కళ్లు పెద్దవిగా విప్పింది, పువ్వు. చెట్ల కొనలు మెరుస్తున్నాయి. నేల మీద సందుల్లోంచి ధారలుగా వెన్నెల పాకుతోంది, చీకటిని పక్కలకి తోసుకుంటో, చుట్టూ అడివిని చూసి-

''చూడు, అమ్మా ! చూడు'' అంటో చప్పట్లు కొట్టి ఆడింది పువ్వు.

నిద్ర కళ్ళతో పాడుతోంది తల్లి.

తలెత్తి తల్లివంక చూసింది.

'' ఎంత అందంగా వున్నావు అమ్మా!''

తన కళ్లకి అందక తల్లిని తీగెలు చీకట్లలోకి పెన వేసుకున్నాయి. పరిమళాలలో విరబోసుకుని నల్లని నీడల్లో వూగుతున్నాయి ఆకు గుబుర్లు.

'' ఎవరి మీద నమ్మా కావిలించుకుని అల్లుకున్నావు? అత నెవరు-గంభీరంగా అట్లా నుంచున్నాడు నీ బరువు మోస్తో?''

''మీ నాన్న ! ''

'' అమ్మా, అమ్మా, అమ్మా! ఎవరు అట్లా కిర కిర మంటారు? అమ్మా, పట్టుకో నన్ను.''

'' అవి కోతులు, మీ నాన్న కోసం వొస్తాయి. నిన్నేం చెయ్యవు అవి.''

''మరి నాన్న వాటిని...''

తన పేరు పిలుస్తున్నారు. పాడుతో వెన్నెలలో తేలి తనచుట్టూ మూగుతున్నారు పుష్ప కిన్నెరలు. తనెరుగును వాళ్లని

''పుట్టావా? నువ్వు ఇక్కడ పుట్టావా?''

- చుట్టూ మూగి, పువ్వుని కడుగుతున్నారు. రేకుల్లో చిన్న చిన్న నొక్కులు అందంగా దిద్దారు. మంచు ముత్యాల హారాలు వేశారు వాళ్ల వెనక తనకి కనపడకుండా నీడలో ఎవరు నుంచున్నారు? తనకి తెలుసు ఎవరో! ఎప్పటెప్పటినించీ, అనంత కాలంనించి, అనేక రూపాలలో, అనేక లోకాలలో, అనేక ఆనందాలతో తనతో చెయ్యి కలిపి ఎన్నడూ తనను వొదలని ఆ నీడ ఎవరు?

తన తలపై నుంచి, చీకట్లలో నించి తియ్యని పిలుపు. దూరంగా దేని కోసమో అరుపు, ఆకులన్నీ నిలిచి వింటున్నాయి. గాలి చిన్న తరంగాలతో పులకరించింది.

ఎవరు? ఎవరు? ఎంత వెతికినా కనిపించని ఎవరు?

''అమ్మా! అమ్మా! ఎవరు?''

''కోయిల ''

'' ఎవర్ని పిలుస్తుంది?''

''ప్రియుణ్ణి.''

''రాడేం?''

''చీకటి.''

''మళ్లీ పిలవ మను.''

''పిలుస్తుంది.''

'' ఎంత అందమమ్మా ఈ లోకం? నే నెక్కడ వున్నాను ఇక్కడికి రాక?''

పువ్వుకి ఎదురుగా, పెద్ద కాంతి పుష్పం అంధకారపు తూర్పు శాఖన వికసించి జ్వలిస్తోంది. తేలికగా తనని కప్పి నవ్వించే మబ్బు తెరలోంచి తన వెలుగు చేతుల్ని జాస్తోంది పువ్వు వేపు.

ఉత్సవాలు, వాయిద్యాలు, అరువులు, సంతోషాలు.

పూజిస్తున్నారు. తోరణాలు కడుతున్నారు. జయ జయ ధ్వానాలు చేస్తున్నారు.

ప్రతి మబ్బుకి రంగుల్ని అలంకరిస్తున్నారు. ఆత్రుతగా సంతోషాన్ని ఆపుకో లేక ఇటూ అటూ పరుగెత్తుతున్నారు. అనిల కుమారులు దుమ్ము దులుపుతూ, అందర్నీ మేలుకోమంటూ, ఎండిన ఆకుల్ని దూరంగా తోసేస్తో. చెట్లు గాలిలోకి నోళ్లు తెరుచుకొని ఆరగిస్తున్నాయి ప్రథమ భోజనాన్ని.

కాంతి, కాంతి ప్రపంచ మంతా కాంతి. ఆకాశాన్నంతా ఆనందంతో నింపుతో కాంతి అలలమల్లే కాంతి విరుచుకు పడుతోంది లోకంమీద.

లోకం రూపమే మారింది. సగం చందమామ నవ్వుతో నమస్కరించి ఆకాశం లోపల కరిగిపోయినాడు. లోకాధిపతివలె వెలిగిన వేగుచుక్క భయంతో ఏ మూలకో వొదిగాడు. మబ్బులు సిగ్గుతో రంగుల్ని కడిగేసుకుని, తెల్లని వొళ్లతో పక్క పక్కల ముడుచుకున్నాయి.

దేదీప్యమానమైన కాంతితో ఎర్రగా, ఎక్కడా కల్మషాన్నీ, అంధకారాన్నీ, అల్పత్వాన్నీ సహించని, క్షమించని దివ్య నిర్మల తేజస్సులు కుమ్ముకుంటో బయల్దేరాడు మార్తాండుడు.

పక్షులన్నీ రెక్కలు చాచి ఎగురుతున్నాయి. మృగాలు వొళ్లు విరుచుకుని కదులుతున్నాయి.

పవన కుమారులు చెట్ల ఆకుల చివర్లలో కూచుని భయంగా చూస్తున్నారు.

సమస్తమూ మరిచి కళ్లు తెరుచుకుని చూస్తున్న పువ్వు వైపుకి తీక్ష్ణంగా ఒక్క కిరణాన్ని విసిరాడు సూర్యుడు.

''చచ్చాను'' అని కళ్లు మూసుకుంది కన్య. వొళ్లంతా వొణికింది. దెబ్బతిన్నట్టు సొమ్మసిల్లింది. తానంతా ఎర్రగా ఐపోయింది. ఒక్కసారి తన మొదట్లోంచి', నేల లోంచి చీల్చుకొని తనలోకి దిమ్మరించే అమృతంతో తానంతా నిండిపోయింది.

'' అమ్మా !'' అని ఒక్క అరుపు అరిచింది భయం కాదు. సంతోషం కాదు. చావుకాదు, పుటక కాదు, నవ యవ్వనం.

తనలోకి ఆ లేత ఎండ, వెన్నెల, కింది గడ్డి నవనవ, ఆకాశంలోని నీలపు నునుపు, తన తండ్రి కొమ్మల బలం, కోయిల కంఠంలోని జాలి, గాలిలోని అర్థం లేని అల్లరి, తన తల్లి వేళ్ల కింది భూమిలోని అనర్గళ సారం - అన్నీ ప్రవహించాయి

తన రేకుల్లో తళతళలు, తన యీనెల్లో నున్నటి వుబుకు, తన బొడిపెల్లో పగలడానికి సిద్ధమైన మదపు సౌరభం, తన తొడిమలో విశాలమౌతున్న బలం, తన సమస్తంలో ఆగని, అంతులేని, కారణంలేని కాంతి.

అకస్మాత్తుగా తనని ముంచుతో, చీలుస్తో, పైన దొర్లి సముద్రము అలల మల్లే మూర్ఛలు తెప్పించే పరిమళం, తనని, తల్లిని, గాలిని ఆకాశాన్ని నింపి, పొర్లే అలలుగా, జ్వాలలుగా తన లోనించి పరిమళాలు.

పట్టలేక ఫక్కుమని నవ్వింది. ఆ నవ్వు ఎండకే కాంతి నిచ్చింది.

ఆ మత్తుకి, ఆ మాధుర్యానికి ఆకాశం కిందికి దిగిరావొద్దా? గాలి యీ వార్త ముల్లోకాలలో ప్రకటించవద్దా? ఆ కాంతి అంతా ఒకటై తనకి హారతి ఇవ్వద్దా - యీ చెట్లు, పక్షులు, కీటకాలు, మృగాలు, యీ అనంతాకాశం, సూర్య చంద్రులు యీ లోకమే తన పరిమళ సౌభాగ్యం కోసం సృష్టి పొంద లేదా?

తన ముందు ఇం కెవరు?

అల్లరిగా గంతులే సింది. చప్పట్లు కొట్టింది. కళ్లలోంచే కాంతుల్ని విసిరింది. ఎవరు అటు వెళ్లినా ఆకుల వెనుక దాక్కుని తొంగి చూసి పక పక నవ్వింది. తన రేకుల్ని వూపింది. పరిమళాన్ని ఎక్కడా అంతం లేని భాగ్యం మల్లే విరజిమ్మింది ప్రపంచంమీద.

సంగీతాలతో, నృత్యాలలో సోలుతో, తూగుతో, చుట్టూ మధుపాలు సేవించి వెంబడి రాగా, పూలని లెక్క కింద తలెత్తి చూడకుండా గర్వంగా యవ్వనంతో మదించి, వొంటి నిండా పచ్చని పుష్ప రజం చల్లుకుని పోతున్నాడు మధుపం.

ఎండలో రజంలో అద్ది నల్లగా మెరిసే అతని దేహం, క్రూరమైన తొండం, రక్తంవలె ఎర్రనైన కళ్లు. గాలిని శూలాలవలె గుచ్చే పెద్ద మీసాలు చూసి వొణికింది పువ్వు.

''అమ్మా! ఎవరది?'' అని తల్లి ఆకుపచ్చ పమిటలో దూరింది.

నవ్వి కూతురు తల నిరిమింది.

''నీ జోలికి రాడులే'' అంది కొంటెగా తల్లి.

''రాడా? ఎంత పొగరు?'' అంటూ ఆకుల్లోంచి సగం తొంగిచూసి, పరిమళాల్ని విసిరింది పువ్వు. వూపిరాడనీక మొహానికి అడ్డుపడి, రెక్కల బలాన్ని లాగేసే ఆ పరిమళానికి తల తిరిగి

ఆగాడు మధుపం.

''అమ్మా! ఆగాడు'' అంది భయంగా పువ్వు.

తనని ఆగనీక, నిలవనీక, ఏమిటి ఆ బాధ? తియ్యని మత్తెక్కించే ఆ వేదన ఏమిటో తనకి తెలీక, భయపెట్టి తనని తొందరచేసే ఆ కాంక్ష!

తిరిగాడు తనవేపు

పొమ్మన్నాడు అనుచరుల్ని మళ్లీ ఇంకోసారి కొత్త పూరజం అతని నిండా చల్లి అలంకరించి ఎగిరిపోతున్నారు మిత్రులు. చుట్టూ ఆకుల మీద వాలి నవ్వుతున్నాడ పోకిరి వాళ్లు.

తనవేపు ఎగురుతున్నాడు అతను. బలంగా, ధైర్యంగా అతనికి ఎవరు ఎదురు అన్నట్టు. ఎండలో మెరుస్తో, తేలుతో, గాలిని చీల్చుకుంటో వొస్తున్నాడు అనివార్యంగా.

సిగ్గు, సిగ్గు, సిగ్గు,

తన గర్వం, తన ఆధిక్యత, విజృంభణ - ఏమీ లేవు. దాక్కుంది ఇంకా లోపలగా.

వొస్తున్నాడని భయం, సంతోషం.

తీరా రాడేమోనని దిగులు, న్యూనత.

వొస్తున్నాడని గర్వం. సిగ్గు.

ఏమిటి అంత స్వతంత్రం?

ఏమిటి ఇంత ఆలస్యం?

తను తప్ప ఇంకేం కనపడకుండా ఐ, తన చుట్టూ ప్రాధేయపడి పాడాలి.

తాను మాత్రం అందక, ఆకుల్లో, తప్పించుకుని వేధించాలి

నిర్లక్ష్యంగా, అవలీలగా ఆకుల్ని వొత్తిగించి, తనని నలుగురి ముందూ బాహాటం చేశాడ. క్రీగంటితో చూసి, ''పో, ధూర్తుడా!'' అంది. కాని తన కంఠ స్వరమేనా అది? ఏమి టా తియ్యదనం, ఆ ఆహ్వానం? త నెంత ప్రయత్నించినా తనకి లొబడని ఆ హృదయారాటం?

వెడల్పయిన స్వరంతో, జుమ్ముమనే ఆ ఆపులేని ప్రేమగీతాన్ని అలాపిస్తో తన చుట్టూ తిరుగుతున్నాడు. ముందుకాళ్లని తనవేపు జాచి, రెక్కల మీద రంగు రంగులుగా మెరుస్తో ఎండ. అతని వొంటి మీద రజపు మదపు వాసన తల తిప్పుతోంది.

పొంగివచ్చే వరదమల్లే ముంచేసింది తన కింకేం తోచకుండా ఆ మధుప గీతం. సముద్రపు హోరుమల్లే రక్తపు పోటుమల్లే.

అడుగుతున్నాడు, నవ్వుతున్నాడు, తల వొంచి ముందు కాళ్లతో ప్రాధేయపడుతున్నాడు. ''నీ కోసమే అనంత కాలం నుంచీ వెతుకుతున్నాను. నా ఐశ్వర్యాన్ని నీ పాదాల ముందు గుమ్మరిస్తాను. తలెత్తి ఒకసారి నావంక చూడు''! అంటున్నాడు.

అన్నీ అబద్ధాలు, కాని, ఎంత మధురమైన అబద్ధాలు!

నీ వొక్కతవే నే నాకు అన్నాడు. ఆ పుష్ప రజమంతా ఎక్కడిదో? ధూర్తుడు.

తెల్లని రేకలు మెరిపించి చిన్న నవ్వు నవ్వి దాక్కుంది, ఆకుల మధ్య, గాలి సహాయంతో.

అతను బలహీనంగా, మృదువుగా కొమ్మల్లో దాక్కునే తన కోసం, ఇంకా రాడేం? వెళ్లి పోడుకదా? మెరుస్తో, రెక్కల వూపుతో, లెఖ్ఖ లేని పువ్వుల మధ్య పువ్వుని అనవసరమని తలవూపింది సృష్టి. రేకులు రంగు తప్పి ముడతలు పడ్డాయి. కేసరాలు ఒక్కొక్కటే వూడి

జాలిగా కింద ఆకుల మీద వాలి గాలి వూపుకి దుమ్ములో పడ్డాయి. కాని దృష్టిని తన గర్భం వేపు తిప్పి, తనసీ, తన అందాన్నీ, ప్రపంచాన్నే మరిచింది పువ్వు.

మబ్బుల నుంచి చివరి రంగుల్ని పిలుచుకుని సూర్యుడు ఎప్పుడు కడసారి శెలవు చెట్ల చిటారి కొమ్మల మీద గరుడుల నుంచి తీసుకొని వెళ్లిపోయాడో, ఎప్పుడు శాంతి గీతాల్ని వాయు కుమారులు పాడి కొమ్మల్లో కూచున్నారో, ఒక్క క్షణం విశ్రాంతి లేక తిరిగిన జీవులన్నీ ఎక్కడెక్కడ అన్ని వ్యాపుర్తుల్నీ వొదిలి నీడల్లో వొదిగాయో, పక్షులూ, కోతులూ తన తలపై గుబుర్లలో ఎప్పుడు మాటు మణిగాయో గమనించనైనా లేదు పువ్వు.

వెతికి వెతికీ మూల మూలలు దాక్కున్న వెలుతురిని మింగేస్తోంది వెయ్యి నాలికలతో చీకటి.

మొదటి నక్షత్రపు మిణుకు మిణుకు లోంచి జారిన కాంతి రేఖ మీద కూచుని వొచ్చి నిలిచాడు తన ముందు.

తన పేరు పిలిచాడు.

'' ఎవరు'' అంది పువ్వు. కాని తెలుసు తనకి,

గజగజ వొణికింది. చుట్టూ చూసింది ఏడుస్తో.

''రా !'' అన్నాడు.

''నా పాపాయి'' అంది.

''నీ ప్రాణాన్ని నీ పాపాయి కిచ్చి నాతో రా !'' అన్నాడు నవ్వుతో

''ఎట్లా రానూ!''అని అరిచింది చివరి అరుపు.

తన చేతిని పట్టుకుని, కన్నీళ్లు తుడిచాడు.

''చూడు !'' అన్నాడు.

లోకమంతా పెద్ద వెలుగు, అన్ని రూపాల్నీ, భిన్నత్వాల్నీ తనలో కరిగించు కుంటున్న మెత్తని వెలుగు. నేల మీద ఎండుటాకులనించి, ఆకాశాన నక్షత్రాల దాకా, అన్నిటినీ ఏకం చేసే దివ్య కాంతి, అంతా, అంతా, ఆ వెలుగంతా అతను. అన్ని చోట్లా అతను.

పొట్టలోని ఆకళ్లని నింపుతో, పట్టుకు చీల్చుకుతింటో, చీకట్లో దాక్కుంటో, పిల్లలకి రసం తాగిస్తో, చంపుతో, ఏడుస్తో, నవ్వుతో, కోపంతో దూకుతో, ఆనందంతో వూగుతో - ప్రతి మూలా అతను, తన పాపాయిని లాలిస్తో, తాగిస్తో అతను.

''రా!''

నవ్వుతో తన వార్ధక్యం, నిరర్ధకత్వం, ఎండుతనం అంతా పోయి, బాల్యం. యవ్వనం, బలం, సంతోషం, మాతృత్వం, ప్రేమ, అన్నీ అతని ముందు అర్పించి మొక్కింది.

అతని చెయ్యి పట్టుకుని అనంతాకాశంలోకి ఒక్క దూకు దూకింది.

ఇంక భయమనేది లేదు, విచారం లేదు, సందేహం లేదు. సమస్తమైన ప్రపంచంతో, కాలంతో అతి సన్నిహితు డతడు. అతని వేళ్లను పట్టుకున్న తన నింక ఏ మూల ఏ రూపంతో నిలిపినా ఆ కొత్త వుండదు. తన కోసం చేతులు జాచి వుంటాయి చిరు నవ్వులు వెలిసి వుంటాయి. తన ఆగమనం కోసం గొప్ప విలువలు ఉంటాయి.

ఆకాశంలో తేలుతో, భక్తితో అతని మొహం వంక చూసి పక్కున నవ్వింది- ఆనందాన్ని అణుచుకోలేక!

# జ్ఞానపీఠ్ పురస్కార గ్రహీత శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

– ఆచార్య జి. సుందర రెడ్డి

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ శత జయంతి సంస్మరణ సమాలోచన సందర్భముగా వారి రచనా వైభవాన్ని, వారి అంతర్మధనం లోంచి చిందిన సుధారస బిందువులను మరోసారి రుచి చూడాలన్న మనశ్చాపల్యానికి దాసానుదాసుడనై చేస్తున్న మరో అపరాధమిది. తన అమృత హస్తాలతో విను వీధిన వెలసిన అందాల హరివిల్లు లో ఏడేడు రంగులనూ తనదైన లోకం లోనికి తోడుకొచ్చి ఆధునిక తెలుగు సాహితీ ప్రపంచాన - కవిత, కథ, నాటకం, నవల, నాటిక, విమర్శ మరియు వ్యాస - రూపాలుగా ఆవిష్కరించిన అసమాన ప్రతిభాశాలి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. తనదైన విలక్షణ వ్యక్తిత్వం సంతరించుకొని ఆధునిక తెలుగు సాహితీ ప్రాంగణంలో అచ్చెరువులొందించే అందాల పూదోట పరిమళాల పన్నీటి జల్లులు కురిపించిన ఆ మహనీయుని రచనా శిల్పం, భావ సంపద అనితర సాధ్యమైన శిల్ప చతురత వలన తెలుగు కళామ తల్లి దివ్య సొగసులు దేశం నలుమూలలా దీప్తివంతమైనాయి. బెంగాలీ సాహిత్యంలో గురుదేవులు రవీంద్రనాథ్ ఠాగూర్ మరియు హిందీలో జయశంకర్ ప్రసాద్ వంటి లబ్ధ పతిష్టులైన సాహితీ మూర్తులకు లభించినట్లు గానే ఆధునిక తెలుగు కావ్య రంగాన విశ్వనాథుల వారికి మహోన్నత స్థానం సంప్రాప్తించి, విశ్వనాథుని రచనలలో ప్రతి అక్షరంలోను వారి విశిష్ట వ్యక్తిత్వం కొట్టొచ్చినట్లుగా కనిపిస్తూ 'చిరయశస్వి' గా పాఠకుల హృదయాలలో వారి స్థానాన్ని పదిలంగా ఉంచే శక్తి నిబిడీకృతమై ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లోని విజయవాడ పట్టణానికి 20 మైళ్ళ దూరంలోనున్న 'నందమూరు' గ్రామములో సంస్కారమంతమూ, సంపన్నమూ అయిన ఒక బ్రాహ్మణ కుటుంబములో 1885 సంవత్సరములో విశ్వనాథ సత్యనారాయణ జన్మించారు. వీరి తండ్రి శోభనాద్రి గారు మిక్కిలి ఉదార స్వభావం గలవారు. నందమూరు గ్రామము లోని తన ప్రాథమిక విద్యనభ్యసించిన విశ్వనాథుల వారు. అటుపైన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి గారి శిష్యరికంలో తెలుగు, సంస్కృత భాషా సాహిత్యాల అధ్యయనం చేసినారు. తదనంతరం వీరు తెలుగులో ఎమ్ ఎ. పరీక్షలో ఉత్తీర్ణులై గుంటూరులోని ఆంధ్ర క్రిస్టియన్ కాలేజిలో అధ్యాపకులుగా కూడా పనిచేసినారు. ఉద్యోగాన్ని వదలిపెట్టి ఐదు సంవత్సరాలు పాటు పుస్తక పఠనంలోనూ, రచనా వ్యాసంగాన నిమగ్నమైన వీరు తదుపరి బందరు జాతీయ కళాశాలలో కూడా కొన్నేళ్ళ పాటు అధ్యాపక వృత్తిలో కొనసాగారు. పిదప విజయవాడ కళాశాలలో 21 సంవత్సరములు పాటు అధ్యాపకులుగా పనిచేసి పదవీ విరమణ చేసారు. వీరి ప్రతిభా విశేషాలను గుర్తించి కరీంనగర్ కళాశాల ప్రిన్సిపాల్ పదవినలంకరించమని వచ్చిన ఆహ్వానం మేరకు కొన్నేళ్ళ పాటు అక్కడ పనిచేసారు. అప్పట్లోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆస్థాన కవి పదవినిచ్చి వారిని సన్మానించడం జరిగింది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు సంస్కృతం, తెలుగు మరియు ఇంగ్లీషు భాషా సాహిత్య రచనలో అనూహ్యమైన ప్రజ్ఞాపాటవాలను కనబరిచారు. కేవలం సాహిత్య రంగాన్నే కాక సంస్కృతి, భారతీయ తత్వశాస్త్రం మరియు కళారంగాలలో కూడా తనదంటూ ఓ ప్రత్యేక స్థానాన్ని

పెలబెట్టుకొన్న వారి వ్యక్తిత్వంలో సమగ్ర జీవన దృష్టి మరియు మానవతా విలువలతో కూడిన ఆలోచనా సరళి స్పష్టంగా గోచరిస్తాయి. ఆర్ద్రతతో నిండిన వారి గుండెలో మహోన్నతమైన మానవతా విలువల పరిరక్షణకై పడే తపన కారణంగానే విశ్వనాథుని ప్రతీ రచన జాతి శ్రేయస్సు పట్ల వారికి గల సంకల్ప బలానికి అద్దం పడుతుంది. అయితే ఆత్మాభిమానానికి మారుపేరైన విశ్వనాథుని వ్యక్తిత్వాన్ని తటస్థంగా పరిశీలించలేని కొందరు సాహిత్యకారులు, విమర్శకులు వక్ర భాష్యాలు చెప్తుతూ ఒక సాంప్రదాయాన్ని కించపరిచే ప్రయత్నం చేయటం వారి తెలివి తక్కువ తనానికి నిదర్శనం.

'నన్ను నెరుగరో! ఈ తెలుగు నాట మీరు విశ్వనాథ కులాంబోధి విధుని' అంటూ ప్రశ్నించే విశ్వనాథునిలో అహంభావం కన్నా ఆత్మస్థైర్యమే మెండుగా కనిపిస్తుంది. తన 'రామాయణ కల్పవృక్షం' రచనకు ముందు మాటగా వ్రాస్తూ 'నా బోటి శిష్యుడు దొరకటం నా గురువులు చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు జేసుకొన్న అదృష్టం. ఇటువంటి భాగ్యం తెలుగు కవులలో నన్నయ్య, తిక్కన వంటి మహా కవులకు సైతం దక్కలేదు, అంటూ చెప్పకలిగిన విశ్వనాథ వారి మనోనిబ్బరానికి, ఆత్మాభిమానానికి జోహోర్లు అర్పించాల్సిందే. 'రామాయణ కల్పవృక్షం' రచనకు అత్యున్నత సాహితీ పురస్కారం 'జ్ఞానపీఠ్' అవార్డు లభించిందన్న వార్త తెలియగానే వీరు తమ మిత్రులతో 'ఇదెప్పుడో ఐదారు సంవత్సరా క్రితమే రావాల్సింది' అంటూ తన స్థాయిని చాటి చెప్పారు. వీరి ఈ ఆత్మాభిమానమే ఇతరులకు మితి మీరిన అహంకారంగా కనిపించింది. కొందరు విమర్శకులు, రచయితలు సైతం విశ్వనాథుని రచనా సంవిధానం పట్ల స్థిరమైన అభిప్రాయాలను ఏర్పరచుకొని కొన్ని 'ముద్ర' లకు లోబడి వారి సాహితీ వ్యాసాంగాన్ని వీక్షిస్తూ అనవసరం అర్థరహితమైన ఆరోపణలు చేయటం జరిగింది నేటి యువతరం లోని నవ కవులు కూడా పాడి పాడి శబ్దాలతో కవితలను అల్లుతూ వాటిని జనమన లోకి 'జెట్' వేగంతో దూసుకు పోయేవిగా అభివర్ణించుకుంటూ సాంప్రదాయానికి, ఛాందస వాదానికి, ప్రాచీన కవితా రీతులకు తేడా తెలియని అయోమయ స్థితిలో గొప్ప వారిని కించపరిస్తే తాము గొప్పవారై పోతామన్న అభిప్రాయంతో అదే పనిగా విశ్వనాథుని వంటి మహనీయుల కావ్య శిల్పం పై 'ముద్ర' లు వేసేందుకు పడే ఆరాటం అంతా ఇంతా కాదు.

విశ్వనాథుని వ్యక్తిత్వంలో వారి హాస్య ప్రయత్నానికి కూడా ఎంతో ప్రాధాన్యత లభించింది. తమ మిత్రులతో సరస సంభాషణ సాగిస్తూనే వారు మధ్యలో ఇతరులపైన, అప్పుడప్పుడూ తమపైన కూడా వ్యంగ్యోక్తులు విసిరే వారు. ఒక సారి ఓ సాహితీ విమర్శకునితో మాట్లాడుతూ 'మీరు మీ నవలలో మిమ్మల్నే ఏ పాత్రలోనయినా చిత్రించుకున్నారా?' అన్న ప్రశ్నకు బదులిస్తూ వారు ''వేయి పడగలు'' నవలలోని ధర్మారావు పాత్రలోని మంచి గుణాలన్నింటిని విస్మరిస్తే ఆ పాత్రలో మీకు నేనే కనిపిస్తాను అన్నారట. 55 సంవత్సరములు పాటు తమ రచనా వ్యాసంగాన్ని సాగించి తెలుగు సరస్వతికి ముద్దుబిడ్డయైన విశ్వనాథుని రచనలలోనే కాదు వారి సాధనలోనూ ప్రత్యేకత కనిపిస్తుంది. ఛందోబద్ధమైన రీతిలో ఒకే సారి సుమారు వందేసి పద్యాలను తమ మనఃఫలకం పై లిఖించుకొని ఆ తరువాత నిర్విఘ్నంగా వాటిని కాగితంపై ఉంచటంలో వీరు సిద్ధహస్తులు. అదే గద్య రచనయితే వారు చెబుతూ పోతుంటే శిష్యులు వ్రాస్తూ ఉండేవారు.

మొదట్లో 'వేయి పడగలు' రచనలోని మొదటి మూడు భాగాలను స్వయంగా వ్రాయటానికి విశ్వనాథుల వారికి మూడు నెలలు పట్టగా అటుపైన ఆ పద్ధతికి స్వస్తి చెప్పి మిగిలిన వేయి పుటలను వారు చెబుతుంటే శిష్యులు 29 రోజులలో వ్రాయటం జరిగింది. తరువాత వీరి ఏ నవలా రచనకూ నాలుగు రోజులు కంటే ఎక్కువ సమయం పట్టలేదు. ఇది వారి అద్భుత రచనా శక్తికి, ప్రతిభా పాటవానికీ తార్కాణం.

విశ్వనాథ సత్యనారాయణ గారి వ్యక్తిత్వంలో పరస్పర విరుద్ధమైన భావాలు ప్రస్ఫుటంగా గోచరిస్తూ వారి వ్యక్తిత్వ వికాసానికి, సమగ్ర అవగాహన శక్తికి దోహదం చేసాయి. ఆత్మాభిమానం, అరుదైన ఆలోచనా సరళి, మొక్కవోని ధైర్యానికి, ముక్కుసూటి తనానికి ప్రతీకగా నిలిచే గాంభీర్యత, ఊహా ప్రియత్వం, ప్రాచీన వైదిక సంస్కృతి పట్ల మక్కువ, పాశ్చాత్య సంస్కృతి, సాంప్రదాయాల పట్ల జిజ్ఞాస, సహృదయత, వినమ్రత మరియు సూక్ష్మ పరిశీలనా దృష్టి వీరి ...్యంలో దర్శనమిస్తాయి.

రచనలు :- విశ్వనాథ సత్యనారాయణ గారి రచనలు సుమారు వందకు పైగా ప్రచురితమైనాయి. అందులో అరవైకి పైగా నవలలే. వీటిలో 'వేయి పడగలు', 'చెలియలి కట్ట', 'ఏకవీర', 'బద్దన్న సేనాని', 'మ్రోయు తుమ్మెద' మరియు 'హాహా హూహూ' ముఖ్యమయినవి వీరు 'పురాణ వైర గ్రంథమాల అనే శీర్షికన ధారావాహికంగా ఇరవై నవలలు ప్రచురించారు. 'వేయి పడగలు' నవలను నేటి భారత ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహరావు గారు అప్పట్లో 'సహస్రఫణ్' పేరిట హిందీలోనికి చేసిన అనువాద రచనకు భారత ప్రభుత్వ సాహితీ పురస్కారం కూడా లభించింది. అంబడిపూడి హనుమయ్య గారు 'ఏకవీర' నవలను హిందీలోనికి అనువదించారు. 'వేయి పడగలు' నవలలో భారతీయ సంస్కృతి విరాట్ స్వరూపాన్ని ఆవిష్కరిస్తూ మానవ జీవిత విధానాన్ని కూలంకషంగా విశ్లేషించారు. 'బద్దన్న సేనాని' నవలలో హరిజన యువకుడైనప్పటికీ బద్దన్న పట్టుదలతో జన జీవనాన్ని చైతన్య పరచి ఆనాటి పాలకుల దోపిడీని దౌష్ట్యాన్ని అంతమొందించిన వైనాన్ని వివరించారు.

'దమయంతి ద్వితీయ స్వయం వరం', 'వేన రాజు' వంటి నాటకాలలో సత్యనారాయణ గారు వర్తమాన ప్రజా జీవన సమస్యలను వెలుగులోనికి తెచ్చేందుకు ప్రయత్నించారు. వీరు సంస్కృతంలో 'అద్భుత శర్మిష్ఠ' అనే నాటకాన్ని కూడా రచించారు. వీరి కథలలో 'మాక్లీ దుర్గంలో కుక్క' మిక్కిలి ప్రజాదరణకు నోచుకొంది. వ్యాస రచనా పరంపరలో సాహితీ విమర్శకునిగా, సమాజ సేవకునిగా, భారతీయ సంస్కృతి విలువల పరిరక్షణలో అలుపెరుగని సైనికునిగా కనిపిస్తారు. విశ్వనాథుని వ్యాస రచనలు ఐదు సంగ్రహాలుగా వెలువడ్డాయి. అన్ని సాహిత్య ప్రక్రియలలోనూ తన అనుపమాన ప్రతిభను కనబరిచినప్పటికీ విశ్వనాథునికి ప్రఖ్యాతి ముఖ్యంగా కావ్యరంగంలోనే లభించింది. విశ్వనాథుని పాదిలో అన్ని కావ్యరూపాలు దర్శనమిస్తాయి. 'రామాయణ కల్పవృక్షం', 'కిన్నెరసాని పాటలు' జనాదరణ పొందాయి. 'కోకిలమ్మ పెండ్లి', 'ఆంధ్రప్రశస్తి', 'శృంగార వీధి', 'శశి దూతం', 'తెలుగు ఋతువులు', 'వరలక్ష్మి త్రిశతి' మరియు 'విశ్వనాథ మధ్యాక్కరలు' వంటి రచనలు ప్రశంసనీయమైనవి

'కిన్నెరసాని' పాటలు రచనలో విశ్వనాథ సత్యనారాయణ గారి భావనా పటిమ, కల్పనా శక్తి, ప్రకృతి చిత్రణలో అసమాన నైపుణ్యత కారణంగా మనోరంజకమైన కావ్యశిల్పం అద్భుతమైన రీతిలో ఆవిష్కరింపబడింది. జానపద సంగీత నృత్య కళారంగాల సుందర శిల్పాన్ని ఆకళించుకొని వినూత్న పద్ధతిలో విశ్వనాథుని కలం నుంచి జాలువారిన ఈ గేయకవిత సంకలనం అమితమైన ప్రజాదరణకు నోచుకున్నది 'గిరి కుమారుని ప్రేమ గీతాలు' కావ్య రచనలో వ్యధాభరితుడైన ప్రేమికుని హృదయములోని భావనలను మనోజ్ఞమైన రీతిలో చెప్పటం జరిగింది 'ఆంధ్రప్రశస్తి' రచనలో ఆంధ్ర సంస్కృతి, సభ్యతల విశిష్టతను, తెలుగు ప్రాంతంలోని వివిధ కళా రూపాల ఔన్నత్యాన్ని విశదీకరించడం జరిగింది. 'రామాయణ కల్పవృక్షం' లో రామాయణ గాథలోని వివిధ ఘటనలను హృద్యంగా చిత్రించడంలోనూ, పాత్రల స్వరూప స్వభావాలను మనోజ్ఞంగా వర్ణించడంలోనూ ఒక కవిగా విశ్వనాథుని విశ్వరూపం ప్రతిచోట కనిపిస్తుంది. ఆధునిక తెలుగు కావ్య రచనా ప్రక్రియలో 'నభూతో నభవిష్యతి' అన్న చందోన విశ్వనాథుడు ఛందోబద్ధమైన రీతిలో ఆవిష్కరించిన ఈ రచన మిక్కిలి ప్రాశస్త్యం పొందింది ఈ రచనలో వాల్మీకి రామాయణంలోని కావ్య వస్తువును, పాత్రలను వాటి మౌలిక స్వరూప స్వభావాలకు నష్టం కలుగకుండా జాగ్రత్త పడుతూనే ప్రతీ ఘట్టం లోనూ, ప్రతి పాత్ర స్వరూపంలోనూ నవ్యతకు చోటు కల్పిస్తూ కవి తన వ్యక్తిత్వానికి, ఆలోచనలకు ప్రతిబింబంగా ఈ రచనను అందివ్వడంలో చూపిన ప్రతిభ అసమానమైనది. సమకాలీన స్థితిగతులకు అనుగుణంగా పై రచనలోని ప్రతి అంశాన్ని మలుపు త్రిప్పుతూ అటు సాంప్రదాయ వాదులకు ఇటు ఆధునికులకు ఎలాంటి ఆక్షేపణలకు తావివ్వకుండా చేస్తూనే ఇందులో వాల్మీకి రామాయణంలోని కథా సంవిధానాన్ని అనుకరించటంలోనూ, ఆధ్యాత్మ రామాయణంలోని అలౌకికత్వాన్ని పదిలంగా అందివ్వటంలోనూ, తులసీ రచన 'రామచరిత్ మానస్' లోని భక్తి భావాన్ని సైతం బహు చక్కని రీతిలో విశ్లేషించటం లోనూ విశ్వనాథుని రచనా పాటవంలోని సమతుల్యత, సమగ్ర దృష్టి సర్వదా శ్లాఘనీయం. పాత్ర చిత్రణకు అనుగుణంగా 'రామాయణ కల్పవృక్షం' లో రసావిష్కరణ చేయటంలో విశ్వనాథ రచనా శిల్పం లోని ప్రత్యేకత మిగతా రామాయణ కావ్యాలకన్నా భిన్నంగానూ, గొప్పదిగానూ ఉంటుంది ఈ కావ్యంలోని వస్తు సామాగ్రి మరియు సౌందర్య శిల్పం బహుజనరంజకంగా భాసించడంతో పాటు పండితులు, విమర్శకుల మెప్పు పొందినవి.

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని అహల్యాఘట్టం, అయోధ్య కాండంలోని పట్టాభిషేక పర్వం, అరణ్య కాండంలోని శబరి-ఘట్టం, కిష్కింధ కాండములోని ఆఖరి ఘట్టం, సుందర కాండలోని ఉషా-ఘట్టం, యుద్ధ కాండములోని అంతిమ ఘట్ట వర్ణనలో విశ్వనాథుడు కనబరిచిన నైపుణ్యం అసాధారణం.ఈ రచనలోని వివిధ ఘట్టాల వర్ణనలలోనూ విభిన్న పాత్రల మనోభావాలను వ్యక్తీకరించడంలోనూ, మానవతా విలువల సమర్థనలోనూ కవి అభిప్రాయాలతో ఏకీభవించి పాఠకులు సందర్భోచితంగా అనేక భావాలకు, అనుభూతులకు లోనవుతూ తాదాత్మ్యం చెందటం పరిపాటి. ఇటువంటి మహోన్నతమైన రచనకు 'జ్ఞానపీఠ్' అవార్డును బహుకరించి విశ్వనాథ సత్యనారాయణ గారి ప్రతిభా పాటవాలను, వారి మహోన్నత వ్యక్తిత్వాన్ని సన్మానించటం ఎంతైనా ముదావహం.

# నూతి చీకటి గొంతులో వినిపించిన ఆగమ గీతి

- శివలింగం

తాత్వికత అంటే అనుభవాన్ని హేతుబద్ధంగా చెప్పడం. ప్రతికవికీ ఒక తనదైన తత్వం వుంటుంది. అదే జీవన దార్శనికత. కవిత్వంలో అభివ్యక్తమయే తాత్వికత మేధాగత మైనా హృదయానుభూతి కలిగించే భాషలో వుండాలి. తెలుగులో అటువంటి తాత్విక కావ్యం బైరాగి 'నూతిలో గొంతులు' ఇందులోని తాత్విక సూత్రాలు మానవహృదంతరాళంలో నిగూఢమైన ఆరాటంనుండి, తీవ్రావేదననుండి ఉద్భవిస్తాయి. జిజ్ఞాసువు హృదయంలోని తపన అన్వేషకుని గుండెలోని ఆర్తి తాత్విక చర్చలరూపం ధరించాయి తాత్వికత మేధాస్థాయినుండి హృదయస్థాయికి చేరుకుంది. బైరాగి నిరంతరాన్వేషి, సందేహశీలి. సర్వం కామమయమని ఫ్రాయిడ్, సర్వం అర్థమయమని మార్క్స్, మానవుల్ని కూడాకుక్కల్ని శాసించి నట్టుగా శాసించి బానిసలుగా పనిచేయించుకోవచ్చని పావ్‌లావు చేసిన ప్రయోగాలను బైరాగి అధ్యయనం చేశాడు.

మేము వేలు చీకటంలో సెక్స్ ఉందంటాడు ఫ్రాయిడ్
మేము కాలుచాపటమే ఆర్థిక విపర్యాస మంటాడు మార్క్స్
గంట కొట్టగానే చొంగ కారుస్తూ
పరుగెత్తే కుక్కలమంటాడు పావ్ లావ్
ఎలుకలమీద ప్రయోగాలు చేసి
మీరే ఎలుకలన్నాడొక శాస్త్ర వేత్త
అనుమానం వేస్తున్నది మేమెవరం ఓ దేవా?

సమకాలీన బౌద్ధిక సిద్ధాంత నిబద్ధుడు కాలేదు. మేధస్సు నిరంతర జాగరూకత కలిగే వుంది. ఇలియట్ వేస్ట్‌లాండ్‌కు, బైరాగి నూతిలో గొంతుకలకు పోలిక లున్నాయి. ఇలియట్ కవితాయాత్ర శూన్యత, నిరాశా దర్శనంతో ఆరంభమై విశ్వాసం సంప్రదాయం మజిలీకి చేరుకుంది. ఇలియట్ ఒక్కొమెట్టూ పైకి ఎక్కుతూ ఉన్నత కవితాశిఖరం చేరుకున్నాడు. 'నూతిలోగొంతుకలు' కావ్యం చీకటితో ఆరంభం. విశ్వాసంతో ముగింపు.

రా(
కాల రాత్రి
కరాళ కాల రాత్రి
ఆదిమ తమస్సులు ఆవరించాయి ఆకాశాన్ని

ఇలియట్‌కావ్యానికి ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం పాశ్చాత్య నాగరికతకు, సంక్షోభానికి బీడులే సంకేతం. బైరాగి కావ్యంలో శూన్యమైన మానవ జీవితయాత్రకు చీకటి సంకేతం. ఇలియట్ కావ్యంలో దైనందిన జీవితదృశ్యాలూ, పాత్రల వెనక శుష్కనాగరిక జీవన వంధ్యత్వం ధ్వనిస్తుంది. బైరాగి సామాన్య మానవ జీవిత వైఫల్యం చిత్రించాడు. సంశయ కావ్యం అన్నాడు రచయిత హామ్లెట్, అర్జునుడు, రాస్కాల్నికొవ్‌లు కావ్యంలో నాయకులు. హేమ్లెట్ ప్రశ్న "To be or not to be, that is the question". ఉండట మా మరణించడమా అనేది. 'నేరమూశిక్ష'లో సోనియా తండ్రి రాస్కాల్నికోవ్‌తో అంటుంది :

''మనిషి దిక్కు, మొక్కులేని పరిస్థితిలో ఉండట మంటే ఏమిటో తెలుసా నాయనా''! అని. అర్జునుడు యుద్ధరంగంలో బంధువులతో ఎలాయుద్ధంచేసేదని ప్రశ్న. బైరాగి కావ్యాన్ని ముగిస్తూ వెలుగు చూపమని ప్రార్థిస్తూ అంటాడు ·

మృతదుర్గతి లోంచి
నవజీవిత సద్గతి లోకి
భ్రాంతి నుండి కాంతిలోకి
సోనియా! త్రోవచూపు
వెలుగుచూపు, త్రోవచూపు!

కావ్యంలో భగవద్గీత, ఉపనిషద్వాక్యాలు కనిపిస్తాయి. మత నైతిక శక్తి అడుగడుగునా తోడుగావుంది. హేమ్లెట్ వేదన కర్మపూర్వం. అర్జునుడి వేదన కర్మక్షేత్రంలో తత్క్షణికం, రాస్కల్నికోవ్ బాధ కర్మ తరవాతది. ఒక క్రమబద్ధమైన పరిణామం. బాధలో మథన పడినవాడే పూర్ణత్వాన్ని దర్శిస్తాడు. మనిషి ప్రకృతిలో కలిసేవుంటాడు కాని చూడలేడు. మనిషికి ప్రకృతికి జీవితానికి మృత్యువుకూ దైవత్వానికి, మానవత్వానికీ ప్రేమకూ సృష్టికీ మధ్య ఏకతాసాధన అత్యంత ప్రధానం. కవిత్వప్రాణ ధాతువు ఏకత్వసాధన. కావ్య నాయకులకాలం నాటి రాజకీయ పరిస్థితులను నేటి మానవునికి అంటగడుతున్నాడనుకోడం పొరబాటు. మానవుని అంతరంగం కావాలి. బాహ్య పరిస్థితులు కాదు, ఫాసిస్టు జర్మనీలో, సోషలిస్టు రష్యాలో ఏం జరుగుతుందో తెలియనివాడుకాడు. ఎంతటినియంతృత్వ దేశమైనా కవులు రచయితలు నిర్భీకతతో మరణాన్ని కూడా లెక్కచేయకుండా ప్రభుత్వ హింసనూ, అణచివేతను బహిరంగ పరుస్తున్నారు. ఇంకా తెలియని దెక్కడను? మానవమేధ బుద్ధి హృదయాలను కొంత వరకైనా ప్రభావితం చేస్తున్నది బాహ్య ప్రపంచం కాదు. ఈర్ష్యా ద్వేష మోహాపోహవాంఛా కాంక్షలన్నాడంటే అరిషడ్వర్గాలే నియంత్రిస్తున్నాయి. అందువల్ల నే మానవ మనస్తత్వాన్ని శాసించలేకపోతున్నారు. ముగ్గురు కావ్యనాయకులు సాధించిందేమీ లేదు. వైఫల్యంచెందిన వారే. చీకటిలో కలసిన వారే. వేదన భూత భవిష్య ద్వర్తమానాల్లో వుంటుంది. ఈ వేదన, అజ్ఞానం, అరిషడ్వర్గాల విజృంభణను నిర్మూలించడం కోసం సత్యాన్వేషణ సరియైన మార్గం. ఇదే కావ్య సందేశం.

బైరాగి అనగానే వైరాగ్య కవిత్వం స్ఫురిస్తుంది. కాని ఆశావాదం నిరాశావాదం పడుగు పేకల్లా అల్లుకు పోయిన కవిత్వం బైరాగిది. యశస్సు అర్థంగురించి ఆయన పట్టించుకోలేదు. భారతీయ తాత్విక ధార కవిత్వంలో ఒడ్డు లొరసుకుని ప్రవహించింది. ప్రేమ, చావు, పుట్టుకలవంటి నైరూప్య వస్తువవులనే ఎన్నుకున్నాడు. సమకాలీన సమాజాన్ని. భావజాలాన్ని నిశితంగా పరిశీలించాడు. ఏ రాజకీయ పార్టీకి కలాన్ని తార్చలేదు. స్వతంత్ర ఆలోచనాశీలి. ఏ సిద్ధాంతానికి బద్ధుడు కాలేదు. అందుకే విమర్శకుల ఒంటికంటి చూపుకు అందకుండా. పక్కనుండి వెళ్ళిపోయాడు. మానవతా దృక్పథంతో సత్యం శివం సుందరంగా భాసిస్తుంది. నేడు ఇచట రగిలే రాలే రాజ్యాంగాల ధ్వంసంలో నిలుచున్న నరుడొకడే మృత్యుంజయుడు. చాణక్యుడు, మాకియ వెల్లీలు మరుగున పడ్డారు. బుద్ధుడు, క్రీస్తు మర పుకురావడం ప్రేమకు, త్యాగానికి మరణంలేదు. విప్లవానికి దొడ్డిగుమ్మంలేదన్నాడు. అది పాలకులు రాజ్యపాలకులు తెరచేది కాదు. మానవుడి మీద అచంచల విశ్వాస ప్రకటన వుంది.

''జనమే నిలుస్తారు, కడకు జనమే గెలుస్తారు
మానవుడు రాజరాజు. అతని నవరత్న ఖచిత సింహాసనం ఈ భూతల
సకల జ్ఞాన సూన పరమార్థ సారం.
నరునికి మూల మంత్రం ప్రేమ
నరునికి గుహ్యతంత్రం కరుణ
శిలువ మోయలేని వాడు నవ్య జీవనార్హుడు కాడు
సర్వసంగ త్యాగికి తప్ప బోధి తరువు నీడ నీదు
ప్రతిహృదయం శివ నిలయం
ప్రతి మానవుడొక తీర్థం.''

ప్రేమను వస్తువుగా స్వీకరించి రాసిన కవిత లున్నాయి - ప్రేమ అనే పదాన్ని కామం అనే అర్థంలోనే వాడుతున్నాం. సందర్భాన్ని బట్టి అర్థంచేసుకోవాలి. ప్రేమ మానసికం, కామం మాంసలం. ప్రేమ ఇంద్రియాల వేపు తిరిగితే కామం; అతీంద్రియ సత్తావేపు తిరిగితే ప్రేమ. ప్రేమనుగురించి-

''ప్రేమన్నది మరణ మహో ఫణి ఫణాగ్ర దివ్య మణి,

కామాన్ని జుగుప్సాకరంగా వర్ణించాడు. పుట్టుక నుంచి గిట్టేవరకు వెతుకులాట అసలుప్రేమ వుందా ప్రకృతిని ప్రేమించలేవు. అది రాగద్వేష రహిత ప్రేమను గ్రహించలేదు. పెంచలేదు. ప్రేమను ప్రేమించలేవు. అది వంచన. పూవుకు తొడిమ తావికి పూవుకావాలి. ప్రేమ సహజసులభం కాదు కఠిన సాధ్యం.

ప్రేమ ఒక అల్పక్షణిక కుసుమ కళిక
గాలి వోలె జాలివోలె సువర్ణ కిరణాల వోలె
సహజ సులభం కాదు ప్రేమ
అశ్రు మౌక్తిక రక్తతిలకం

ప్రేమనుండి జగదుత్పత్తి. ప్రేమలోనే అభివృద్ధి. ప్రేమలో లయం. ప్రేమకు చావులేదు. మాడిన ముదిమ్రోడు లోంచి కొత్తవేరు పుడుతుంది. ఎముకల ఎరువు లోంచి సరికొత్త పైరు. ద్రవ్యంలోంచితత్వంలోకి, తత్వంలోంచిద్రవ్యంలోకి, నీరులోంచిగాలి, గాలిలోంచినీరు. నశించేది లేదు. ఇదొక వలయం. అంతే. ఇంద్రియ గతమైన కామంనుంచి మానసికమైన ప్రేమగా మారి ఊర్ధ్వంగా అతీంద్రియ సత్తాత వేపు పయనించినపుడు-

రేయి లేదిక ముందువెనుకల ఒకే కాంతి
హేమరశ్మి తరంగాలలో నీవే నా తరణివి
దిగంతాల కోటికిరణ వికచ వర్ణవసంతాలు
కాని నీవే నా అనర్ఘ పుష్పమణివి.

జీవితం అసంపూర్ణం గనుక నవభాగ్యలిపిని తెలుపలేం. వికృత జీవిత విహిత విధిని ఎదిరించలేం జీవితం పూర్ణమైనపుడు మసిబొగ్గుల బతుకులు కళామాణిక్యాలౌతాయి. కన్నీరు ముత్యా లౌతాయి. చిరునవ్వులు వజ్రా లౌతాయి.

ఆధునిక తాత్విక శాస్త్ర సాంకేతిక రాజకీయ పరిణామాలను నిశితంగా పరిశీలించాడు. కవితా సత్రం వెనక ఎంగిలివిస్తళ్ళ కోసం ఏనాడూ వెదకలేదు. కవితాయాత్రలో బైరాగి ఒంటరి బాటసారి. సగటు మనిషిని అభిమానించాడు. ప్రేమించాడు. తాను నిర్లిప్తుడే !

మూడే మజిలీ లిచట
పుట్టుక, ప్రేమ, చావు!
ఎంతసేపు నడచినా గడిచిపోము
బయలుదేరిన తావు
మనతోడు నడచిన పొద్దు
మనవెనకే క్రుంకుతుంది.

కీర్తికోసం అర్రులుచాచలేదు. నాశబ్దాలు మలచిన శిలలు, ఉలులకు తలలు వంచని శిల లన్నాడు. దిగంబరకవులకు మార్గదర్శిగా కనిపిస్తాడు. ఆధునిక మానవుని అనంత జీవితవేదన బైరాగికవిత్వం. బైరాగి కవితా తపస్సాధన మహత్తరం. త్రికాలాబాధితమైన జీవితసమస్యలను గురించిన అగాధ బాధా సందర్భాలు వున్నాయి గనుక నిత్యనూతనంగా కనిపిస్తుంది. జీవిత శ్మశానంలో కవితా శవ సాధనచేసిన వాడు శ్రీరంగం నారాయణ బాబు. బైరాగికి, నారాయణబాబుకు కవితా సాధనలో సాదృశ్యంవుంది. ఆధునికసమాజంలో నమ్మకంపోయింది.

విశ్వాసంకన్నా విచికిత్స ముఖ్యం. అందుకే నాక్కొంచెం నమ్మ కం యివ్వ మంటున్నాడు.

''నమ్మకంలేని బొంది ఖాళీసిగరెట్టు టిన్ను నమ్మకంలేని ఆత్మ పుల్లలు లేని అగ్గిపెట్టి.
నమ్మకంలేని బతుకు కాలిన సిగరెట్టు బూది

అన్నీ వున్నాయి కాని నమ్మక మొకటే లేదు.

నా కొంచెం నమ్మక మివ్వు.

జీవితాంతం అంతంలేని కవి తాన్వేషణ కొనసాగించాడు. ద్వేషం, ప్రేమల శ్లేష కావ్యపు ఒకే అర్థంకొరకు, అర్థం వెనకభావన కొరకు, భావనలోని దయగల దీవనకొరకు అలమటించాడు కలవరించాడు. 'పాంచజన్యం' కవిత పాండిత్య ప్రకర్ష తగ్గి వచన కవిత హృదయాన్ని నొక్కేలా పలికింది. బైరాగి కవితల్లో మరణం అశక్తతకు, నిర్లక్ష్యానికి, నిష్క్రియతకు అనాసక్తికి ప్రతీక. కవిత్వంలో వైరాగ్యమే కాదు; రాగమూ, సామాన్యుని మీద అనురాగమూవుంది. కవిత్వం రాయడం ఒక గర్వించదగిన అంశంగా ఏనాడూ భావించలేదు. బైరాగి కీర్తికాముకుల ధనార్జనా సక్తి పరుల కోలా హలంలో చిక్కుకొనకుండా పక్కకు తప్పుకుని వెళ్ళిపోయాడు. అద్భుతమైన భావచిత్రాలు గీస్తాడు.

''విశ్వవియ ద్వయొలిన్‌పై తుఫానుల కమా నెగసి
రేపింది నరనరాల్లో అమరవాంఛా గానాలు
హిమాలయపు వయొలిన్‌పై మంచు తుఫానుల
కమాను రేపిన మహోగ్ర సంగీతం
బల్లమీద మల్లెపూలు, గాలి గర్భవతిలా
పరిమళంతో బరువెక్కి నిండిన తనలోతాను.

'అమాత్యుని అకాలమరణం' ప్రజాధనం దోచుకునే వంచకుల మీద మంచి సెటైర్. శాపగ్రస్తమైన జీవితాలకు వెలుగుబాట లేదు. నిరాశావాదమైన ఒకే సత్యంలో నా జీవితమూ అంతే. నా చెప్పలేని భావాన్ని ఎంతబాగా చెప్పాడనిపిస్తుంది.

''సర్వ మసత్యం - ఒకటే సత్యం
ఎల్ల బాటలూ వల్ల కాటి కే
ఓటమి తథ్యం ఓటమి సత్యం
అన్ని పాటులూ భంగపాటుకే''

'చీకటి నీడలు' అనే కవితాగ్రంథంలో జీవితంలో కూడా గుప్పెడుదుమ్మూ పిడికెడు బూడిద యిది నీ మిగిలిన జీవిత సంపద'' అనే భావం కనిపిస్తూనే వుంది. ''జుగుప్స మన ఆదర్శం. ప్రేయసి మన విధ్వంసం'' అన్నప్పుడు తదనంతరకాలంలో దిగంబర కవుల్లో కనిపించిన సత్యాలు. జీవితవిధ్వంసం బైరాగి చిత్రించి నట్టుగా తెలుగు కవుల్లో మరొకరు కానరారు. జీవితవేదన నుండి సంశయంనుండి బయటపడటం కోసం చేసిన తపస్సు ఆతని కవిత్వం. మానవగీత ఆలపించే కంఠం బైరాగి కవిత్వంలో నిరంతరం వినిపిస్తూనే వుంటుంది. 1925 సెప్టెంబరు 5 వ తేదీన తెనాలిలోని ఐతానగర్‌లో జన్మించి 1978 సెప్టెంబరు 9 తేదీన మరణించాడు.

**తాత్త్వికానుభూతిని కవిత్వీకరించిన మంచి కవి బైరాగి.**

***సంప్రదించిన గ్రంథాలు :***


1. నూతిలో గొంతుకలు - బైరాగి
2. చీకటి నీడలు - బైరాగి
3. ఆగమగీతి - బైరాగి
4. బైరాగి సంస్మరణ సంచిక
5. సారస్వత వివేచన - రాచమల్లు రామచంద్రారెడ్డి

# THE ETHICS OF JOURNALISM

**- Dr. D. Anjaneyulu**

Journalism in India, though broadaly developed on the British model, had evolved in its own way. Starting as a mission, it had grown into a profession, and has now become an industry. A major industry, in fact, From one angle, that of the working journalist, it still remains a profession. But, a mission it has long ceased to be, especially after Independence.

Things have changed a lot in the profession, since the late Mutnuri Krishna Rao built up the Krishna Patrika over several decades from 1910 to 1945. The standards and objectives of the editors as well as the tastes and requirements of the readers have undergone a serious change. News papers and periodicals have certainly progressed in terms of technology printing, production, distribution, public relations, sales promotion, etc,. But has there been a corresponding improvement in intellectual calibre, moral earnestness, and integrity of character, which covers courage of conviction as well? No; with, of course, a few notable exceptions. Editorial articles have been sliding down in importance, to the extent of being altogether ignored by the readers. That is so, even in the case of serious journals and periodicals. By and large, we seem to have entered the age of big news papers and small editors.

Even so. Krishna Rao's ideas on the role and equipment of an editor, outlined in his address, in reply to a reception in 1929 remain substantially valid even today:-

"Mere command of the language and facility of expresssion will not do. He must have a knowledge of the history and tradition of the land, breadth of out look, an insight into the mind of the people, faith in the nation's destiny and a vision of its future. More important than all these is his integrity of charater. Only because these quallties are not much in evidence among the Andhra editors of today, Telugu news papers are not able to command the respect they deserve''.

His observations on the academic qualifications and professional training and regulation of those engaged in Journalism are broadly applicable even to the conditions of today. There is, no doubt, a noticeable rise in the number of entrants with high academic qualifications nowadays. Mainly because of the improvement in pay and perks of those employed in the bigger newspapers of all the languages. Which, in turn, is due to the affluence of the papers, apart from the spiralling inflation in general. With all this, and the existence of the Press Council of India and such other bodies, the Indian Press remains a largely unregulated, unorganised profession, compared to other learned professions, like Law, Medicine, Teaching, Engineering, Chartered Accountancy etc. They are all properly regulated and well-organised on the basis of appropriate laws, or self - regulated and well-disciplined.

In recent years, circulations might have multiplied for a variety of reasons and advertisement revenue along side. But, all the same, news readers with a booming voice and poets with a popular appeal do not necessarily make the

best editors, who have to make the readers think, with their wealth of ideas and knowledge of facts.

Against the background of the newspaper finance of today, it is, however, impossible to ignore or minimise the importance of advertisement revenue. Mahatma Gandhis 'Young India' and 'Harijan' (later) can hardly be the role models for the newspapers, journals and periodicals of today. The losses incurred by Gandhi's weeklies were obviously underwritten in other ways, not available to most of the publishers and editors of today.

Even as a journalist, Gandhi was so eagerly read not exactly because he was a great and gifted journalist, but rather, because he was a great man, an outstanding political leader. These journals were his monthpieces and everyone wanted to know what he had to say on one subject or another Khadi, Harijan uplift, civil disobedience, salt satyagraha, Khilafat Movement etc,.

The best that could possibly be done by the news papers and periodicals of today is to see that their policies are not dictated or dominated by the powerful groups of advertisers, with their vested interests. They cannot, of course, afford to reject major advertisements, when most newspapers are found canvassing for them through their field staff. But they can certainly take it in their stride, when as a reaction to their editorial comments or news coverage, a powerful party, Governmental or non-Governmental withholds advertisment. They need not get unduly agitated about it.

Even today, when we are living in a commercial age, we find a few newspapers in the West, including the US Itself, which take an uncommercial view of newspaper management. In this connection, one thinks of The Christian Science Monitor (of Boston), which is run not for a profit motive, but to spread its message. Its circulation is necessarily and deliberately limited - to 1.5 or two lakh copies, when its contemporaries are printing in millions. Advertisements are limited and selective, if at all. But this ordinance of self denial enables the paper to maintain a high degree of political objectivity, and devote adequate attention to literature and the arts.

Krishna Rao too maintained a commendable degree of objectivity choosing to criticise even close friends like Dr. Pattabhi, when there was occasion for it. But, with all that, it cannot be forgotten that he was an active Congresman and an ardent devotee of mahatma Gandhi. Which itself with the best will in the world, might sometimes have affected his judgment objectivity. To recall a reasonably close parallel, we might think of Ramananda Chatterji of The Modern Review (of Calcutta), who was probably pro-Congress, but did not spare any one in his "Notes"- Mahatma Gandhi, Jawaharlal Nehru, or Subhas Chandra Bose.

All in all, Krishna Rao had to go through the ordeal of walking the razor's edge (asidhaaraa vratam) in his career as an editor. And he emerged unscathed, in a manner of speaking. that is more than can be said of any competent, courageous, conscientious editor.



The Good Samaritan ', a ceramic sculpture by Anitya Roy

MISIMI/ మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad - 500 020. Postal Regd No H/SD/191



In Boreas, a woman identifies with spring flowers struggling against winter. This forgotten painting was auctioned for £ 848, 500 in London.